# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి.

# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY

మార్చి 1940

సంపుటము ౧౩ సంచిక ౧

# గృహలక్ష్మి

## సాలుచందా మొదలగునవి

ఈసచిత్రమాసపత్రిక సాలుచందా రు. 3. అర్ధ సంవత్సరపుచందా రు. 1-8-0 అంతకుతక్కువకాలపరిమితికి చందాపద్ధతిలేదు. విడికాపీ రు. 0-4-0 అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వానివిలువ మేరకు తపాలబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

## ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసినవస్తువులనుగూర్చి ప్రకటించుట కీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన ఛార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

## ఏజెంట్లు

వేఱొకపుటయందు మాకు ఏజెన్సీలుగలతావులు ప్రకటింపబడినవి. ఇతరతావులయందు మాకు ఏజెంట్లు కావలయును. వివరములకువ్రాయునది.

## వ్యాసములువ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీ జనాభ్యుదయమై యుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంథికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింపనంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. ప్రచురింపబడని వ్యాసములకు తపాలాబిళ్లలు పంపిన వాపసు చేయబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

## సంచికలుచేరనిచో

సంచికలుచేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. ప్రతిమాసము 7-వ తేదీతరువాత చేరలేదనివ్రాయుచో తిరుగకాపీలుపంపజాలము. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలుచేరనివారికిని తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లెయింటును చేయునది.

## చిరునామామార్పు

చిరునామాయందు మార్పుఉండుచో 1-వ తేదికి 10 దినములుముందుగనే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

## చందాముగిసిన

చందా ముగిసినతోడనే ఆవిషయము వారికి ఆయామాసములయందు తెలుపబడును. ఈ సూచన చూచి తమచందాధనమునుపంపి గృహలక్ష్మిని యథారీతిని పోషింప చందాదారులను ప్రార్థింతుము. చందాదారులుగనుండ ఇష్టములేనిచో ఆసంగతి వెంటనే తెలుపగలరు. మనియార్డరుపంపుటగాని, చందాదారులుగనుండ ఇచ్ఛగింపమని లేఖాముఖమున తెలుపుటగాని చేయనిచో తరువాతసంచిక వీ. పీ. గా పంపగలము.

## ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, బ్యాంకుచెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు, గృహలక్ష్మికిసంబంధించిన ఇతరమైన యావత్తు ఉత్తరములు డాక్టరు కే. యన్. కేసరి, ఎడిటరు గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయునుగాని ఇతరవ్యక్తులపేర ఎంతమాత్రము పంపకూడదు.

# SUMANGALI

a B.N. REDDI - RAMNOTH - SEKAR PRODN.




STORY & SCREENPLAY. RAMNOTH
SONGS & DIALOGUE. RAGHAVACHARI
DIRECTION . . . B.N. REDDI
MUSIC DIRECTION. . NAGIAH
ART DIRECTION . . . SEKAR

[STUDIO: NEWTONE]



పూర్వాచార నిబద్ధమై నడచుకొను
సంఘమునకును అంతరాత్మనువశుడై
వర్తించు మానవునకును వైరము...
నికృష్టమగు యదార్థములకును
ఉత్కృష్టమగు ఆదర్శములకును
పరస్పర సంఘర్షణము.



సుమంగళి

SEKAR

# విషయసూచిక


1. స్వవిషయము ... ... ... ... 1
2. ఆశీస్సు—శ్రీ వాజిపేయయాజుల రామసుబ్బారాయుడుగారు ... 4
3. శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు—శ్రీ కే. యన్. కేసరిగారు ... 7
4. గృహలక్ష్మి జయంతి మహోత్సవము ... ... ... 9
5. స్త్రీలు – భారతదేశము—శ్రీమతి పొణకా కనకమ్మగారు ... 17
6. నీతిసామెతలు—శ్రీమతి కోటదుర్గ సోమిదేవమ్మగారు... ... 20
7. ప్రేమ, భక్తి, జ్ఞానప్రసన్న పారిజాత ప్రసూనములు—శ్రీయుత ...
   విం. అ. సూర్యనారాయణగారు ... ... .. 21
8. లలిత శపథం—శ్రీమతి దుగ్గిరాల వెంకటసుబ్బమ్మగారు ... 25
9. జీవయాత్రకుఁ దగిన నెచ్చెలివి నీవ—శ్రీమతి వాజిపేయయాజుల మహాలక్ష్మిగారు 28
10. కళాకలాపము—కవితాకళ—శ్రీయుత గోనెల నరసింగరావుగారు ఎం.ఏ.బి.యల్. 29
11. ఆశీస్సు—శ్రీయుత కవికుమార మునగపాటి విశ్వనాథశాస్త్రిగారు ... 32
12. ఆశీస్సు—శ్రీయుత నండూరి ఈశ్వరంగారు ... ... 33
13. వివేకానందుని దృష్టిలో భవిష్యన్నారీ సమాజము ... ...
    శ్రీయుత స్వామి పూర్ణానందగారు ... ... ... 34
14. ప్రబోధము—శ్రీమతి ఇనుగంటి సరస్వతీదేవిగారు ... ... 40
15. Messages and good wishes to 'Grihalakshmi' (ఆశీస్సు - సందేశములు) 41
16. సందేశము - సందేహము—శ్రీమతి రాజకుమారిగారు ఎం.ఏ. (క్యాంటబ్) 43
17. సమాధానము—శ్రీయుత గోనెల నరసింగరావుగారు ఎం.ఏ. బి.యల్ 44
18. ఆశీస్సు సందేశములు ... ... ... ... 48
19. భక్తి—శ్రీమతి ఆచంట సత్యవతమ్మగారు ... ... 50
20. ద్రవ్యనిర్మాణం—"వసంత" ... ... ... 51
21. శ్రీ రమణగురు స్తవము—శ్రీమతి పొణకా కనకమ్మగారు ... 55
22. శ్రీ రమణలీల ... ... ... ... 56
23. గృహలక్ష్మి జయంతి మహోత్సవము—శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి కృతజ్ఞత 57
24. ఆశీస్సులు, అభినందనములు ... ... ... 65
25. సంపాదకీయములు ... ... ... ... 66
26. గృహలక్ష్మి జయంతి మహోత్సవము (ఆశీస్సులు) ... ... 69


త్రివర్ణ చిత్రములు :


'కవికలహంసి' శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు

# గృహలక్ష్మి

## స్వర్ణకంకణము

**1940**

'కవికలహంసి'

శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు

---

'కవికోకిల'

శ్రీమతి వి. రాధామణిగారు

# గృహలక్ష్మీ స్వర్ణకంకణ గృహీత



'కవికలహంసి'

**శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు**

వైస్ ప్రెసిడెంటు, స్నేహలతాకవితాసంఘం, జటప్రోలు సంస్థానం.

సీ. సంగీతసాహిత్య సత్ప్రౌఢిమీఱఁగా దిక్కులఁ గడువన్నెకెక్కె నెవఁడు
నత్యంతభక్తితో నలరామచరితంబు గృతులల్లి యెవ్వండు కీర్తిఁగాంచె
సచ్చిదానందనిశ్చలచిత్తుఁడై గ్రాలి యెవ్వాఁడు ధరవీడి యేగెదివికి
యతిరాజ దాసవిఖ్యాత నామమెవండు గాంచెనో వాని శ్రీగర్భమందుఁ

గీ. బుట్టి సత్కీర్తివడసిన పుణ్యశాలి
సుగుణరత్నాకరుని బరిశుద్ధచరితు
భవ్యధీశాలి రాజగోపాలవరునిఁ
కరముఁబట్టితి సంతోషకలితనైతి.

సీ. దయమీఱ నెవ్వాఁడు దాతృత్వఖనియయి గణనీయమైన విఖ్యాతిఁగాంచె
సకలవిద్యలునేర్చి సభలలో నెవ్వాఁడు చతురత్వమునుజూపి ప్రతిభఁజెందె
గీతామృతముఁద్రావి కృతకృత్యతనుజెంది యెవ్వాఁడు జ్ఞానియై యేపుమీఱె
సౌభాగ్యగాంభీర్య సౌశీల్యవితతిచే నెవ్వాఁడు ధన్యుఁడై నివ్వటిల్లె

గీ. నట్టి శ్రీ రాజగోపాల న్యాయవాది
కతని కులసతి లక్ష్మ్యంబ యనఘచరిత
గర్భమందునఁ బుట్టితి ఘనతమీఱ
ధర 'సరస్వతి' యనుపేరఁ బరగుఁదాన.

—సరస్వతీ రామాయణము.




## స్వవిషయము

శా. నీ పద్యావళు లాలకించు చెవులున్ నిన్నాడు వాక్యంబులున్
నీపేరం బనిసేయు హస్తయుగముల్ నీమూర్తిపైఁ జూపులున్
నీపాదంబులపొంత మ్రొక్కు శిరముల్ నీసేవపైఁ జిత్తముల్
నీపై బుద్ధులు మాకునిమ్ము కరుణన్ నీరేజపత్రేక్షణా.

మ. హరికిం బట్టపుదేవి పున్నెముల ప్రోవర్థంపుఁ బెన్నిక్క చం
దురు తోఁబుట్టువు భారతీగిరిసుతల్ దోనాడు పూఁబోఁడి తా
మరలందుండెడి ముద్దరాలు జగముల్ మన్నించు నిల్లాలు భా
సురతన్ లేములువాపుతల్లి సిరియిచ్చున్ నిత్యకల్యాణముల్.

(శ్రీమదాంధ్రభాగవతము)

కనదంభోజనిభాస్యయై, కుసుమకోమలగాత్రయై, కల్యాణకళాస్వరూపిణియై కమనీయగుణ సంపద్విలసిత చారునేత్రయై, నవ్యయౌవనసురూపయై చెన్నొందు "గృహలక్ష్మి", ముగ్ధత్వమాధుర్యధుర్యమగు మురిపెంపు దరహాసచంద్రికలతో సొంపునింపు నీ సంచికతో పదమూడవ సంవత్సరములో ప్రవేశించుచున్నది.

చిరుతప్రాయపు చక్కటులనుచాటుచు, చిన్నారిపొన్నారిచేష్టలను స్ఫురింపజేయుచు శైశవములో, ముద్దులు మూటగట్టు సుద్దులను సుదతుల కొసంగినది. పలువేడుకులతో గూడిన బాల్యంపువేషభాషల సౌరభ్యమును భామినీప్రపంచములో ప్రకాశింపజేసినది. ఇప్పుడీమె పడుచుప్రాయపు పోకడలతో భావగర్భిత భాషావిభూషణముల బ్రసరింపజేయుచు, పండితప్రవరుల ప్రస్తుతిసేసలను బడయగల్గుచు, స్వాతంత్ర్యాభిలాషాప్రపూరిత సమ్మోదసంభరితచిత్తయై యొప్పుచున్నది.

భాషాపరిచయప్రభూతమగు పడుచుదనపుబింకములను పొడసూపుచు, సిగ్గును సూచించుచు చిరునవ్వులొలయు సుందరవదనమును సారస్వతారాధకులకు జూపుచున్నది. సహజసౌందర్యగరిమకు ప్రత్యక్షనిదర్శనమగు సర్వాంగసౌష్టవమును సందీపింపజేయగలుగుచున్నది. ఈ పత్రికాలలామ, తన నింతదనుక ప్రేమతో నాదరించి, ప్రశస్తమగు వ్యాసములతోడను పద్యరచనలతోడను పెంపువహింపజేసిన పెద్దలందరకును, పాఠకలోకమునకును కృతజ్ఞతా పూర్వకమగు అభివందనము లర్పించుచున్నది.

ఆంధ్రమహిళారత్నముల కనుంగుసోదరియై ఆంధ్రమహిళాభ్యున్నతి కొరకు సేవా సాధనమై యొప్పుచున్న "గృహలక్ష్మి" సుస్థిరముగ నిలిచియుండి, సత్కీర్తిగాంచ గల్గుటకు స్త్రీ పురుషులెల్లరి సాహాయ్యమును, ఆంధ్రులందరి ఆదరాభిమానములను అధికముగ నభిలషించుట సహజమేయగును.

మాతృభాషామాధుర్యమును ముదితల కెరింగించుచు, స్త్రీల సాంఘికాభివృద్ధికి వలయు సాధనములను తెలియపరచుచు, గృహపరిశ్రమలను ప్రోత్సాహించుచు, జాతీయ భావములను, దేశసేవాతత్పరతను స్త్రీలలో ప్రబోధించుచు, ఉవిదల ఉన్నత విద్యాపరిశ్రమకుత్సాహపూరితమగు నుద్బోధ గావించుచు, స్త్రీ స్వాతంత్ర్యోద్యమమునకు చేదోడుగ సేవజేయుచు, సంసారజీవితసుఖమును సుదతులకు సమకూర్పగల సద్విద్యాదర్శములను ప్రచారమొనరించుచు, పండ్రెండేండ్లనుండి పాటుపడుచున్న "గృహలక్ష్మి" తన పురోభివృద్ధికై ప్రజాభిమానమును, గృహలక్ష్ముల ప్రేమాతిరేకమును కాంక్షించుచున్నది.

అశాంతియుతమగు ప్రపంచవాతావరణములో, అననుకూలములగు ఆర్థికపరిస్థితులలో నిట్టి పత్రికానిర్వహణము నవిచ్ఛిన్నముగ సాగింపగల్గు టెంతయు కష్టసాధ్యమనుట సర్వజనవిదితమగు విషయమైయున్నది.

లాభనష్టముల నిసుమంతయు సరకుగొనక, స్త్రీల శ్రేయస్సునే పరమావధిగ భావించి, స్త్రీల యభివృద్ధికిని, తద్వారా యావత్సంఘముయొక్క క్షేమమునకును, స్వార్థ

రాహిత్య భావములతో నింతవరకును ప్రజాసేవను, భాషాసేవను చేయగల్గిన "గృహలక్ష్మి" తన భావిభాగ్యోన్నతికై విశేషపాఠకవర్గమును, అభిమానుల అధికాదరమును, చందాదారుల హెచ్చుసంఖ్యను ఆశించుట అందరును అనుమతింపదగిన అభిమతమేయగును.

పండ్రెండవ సంవత్సర ప్రారంభమునుండియు లలితకళారాధన యందధికోత్సాహమును వెల్లడించుచున్న నీ పత్రికాకన్యక, జీవితానందకరములగు కళలయొక్కయు, గృహవిద్యలయొక్కయు పరిశ్రమాభివృద్ధిని గోరుచున్నది.

లలితకళలలో ఘనతగాంచిన లలితాంగుల నీ కన్యకామణి కడుప్రేమతో నాహ్వానించి ఘనముగ సత్కరించుచున్నది. కవితాకళాధురీణలగు కాంతారత్నముల గ్రంథరచనలను గౌరవించుచున్నది. విజ్ఞానకాంతులను వనితాలోకములో వెదజల్లెడు విదుషీమణులను సువర్ణకంకణములతో బహూకరించుచున్నది.

ఇట్లు స్త్రీ విద్యావ్యాప్తి కెంతయు చేయూత నిచ్చుచు, నిచ్చలు స్త్రీ యుద్యమమునకు తోడ్పడుచున్న ఈ పత్రికాలలామమును ప్రత్యేకాభిమానముతో స్త్రీ లెల్లరును, స్త్రీ విద్యాభిమానులందరును ప్రోత్సాహింపవలసిన బాధ్యతయైయున్నది.

ఆంధ్ర సోదరీమణులందరి ఆదరముతో, ఈ పత్రికారత్నము ఆంధ్ర పత్రికాసారస్వత ప్రపంచములో ప్రత్యేకార్హతనుబడయగల్గు భాగ్యమునకై నిరీక్షించుచున్నది.

భారతాంబ ప్రశస్తప్రపంచప్రఖ్యాతిని ఖండాంతరముల వ్యాపింపజేయుచున్న భారతరమణీమణుల ఆదర్శములను ప్రస్తుతించుచు, ఆంధ్రమాత కధిక యశస్సు నొడగూర్పగల మహిళారత్నములు స్త్రీజనోద్ధరణమునకు చేయుచున్న సేవను శ్లాఘించుచు, స్త్రీల సౌభాగ్యమునకును, సాంఘికజీవితములో సర్వతోముఖాభివృద్ధికిని, అమితోత్సాహముతో పాటుపడ దీక్షనుబూనిన ఈ పత్రికాకుమారిని అభిమానులందరును చిరాయురభివృద్ధితో చెలువొంద నాశీర్వదింప వేడుచున్నాము.

ఆంధ్రరాష్ట్ర మతిత్వరలో సమకూరునట్లును, తత్సౌధాంతర్భాగమున అతిపల ఘనతనుద్దీపింపగల విద్యుద్దీపమువలె ఈ పత్రిక వెలయునట్లును అనుగ్రహింప శ్రీసర్వేశ్వరుని ప్రార్థించుచున్నాము.

# ఆశీస్సు

(ఈ దిగువ ఆశీస్సు పద్యములు "గృహలక్ష్మి" జయంత్యుత్సవమునాడు సభలో శ్రీ స్నేహలతా కవితా సంఘాధ్యక్షులగు శ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయుడు బి. యె. బి. ఇడి. గారిచే చదువబడినవి.)

మ. పదమూడేడులు రాకమున్నె యిల భాస్వత్కీర్తి నార్జించుచున్
ముదితల్ నేర్వఁగలట్టి తత్త్వగుణముల్ బోధించు భావోన్నతుల్
ముదమారన్ బ్రకటించి మించితివి సంపూర్ణాయురారోగ్యముల్
గుదురై నెక్కొనుఁగాత నీకు గృహలక్ష్ముల్ నిన్ను సేవింపఁగన్.

ఉ. మంచి సతీత్వ తత్త్వమును మానితబుద్ధియు సత్యధర్మముల్
గాంచఁదలంచియున్న గృహలక్ష్ముల కెల్లను మార్గదర్శివై
యంచిత తత్త్వబోధన లనంతముగాఁ బ్రకటించి ధాత్రిలో
మించిన నీకుఁ జేకుఱుత మేల్శుభముల్ చిరకీర్తిసంపదల్.

మ. సరసాలంకృతి సొంపునింపెడు వచశ్చాతుర్యమా నీయెడన్
స్థిరమై వెల్గుచునుండెఁ దావక యశోద్దీప్తుల్ బిసాళింపఁగాఁ
బురుషవ్రాతములైన నీదు గుణముల్ బూజించి వర్ణించు వై
ఖరి నొప్పారుచునుండు నీకు శుభమెక్కాలమ్మగున్ బుత్రికా!

సీ. నడపించుచున్నావు నారీశిరోరత్నముల కనువగు మార్గములను గొన్ని
చూపించుచున్నావు సుదతుల కనువగు నడవడులన్నపో కడలుగొన్ని
కురిపించుచున్నావు విరివిగా స్త్రీవిద్య కనువగు మంచి వాక్యములు గొన్ని
బోధించుచున్నావు ముదితల కభివృద్ధిగాంచుట కనువగు కళలఁ గొన్ని

గీ. గడచెఁ బండ్రెండు వర్షముల్ గణనకెక్కు రీతి నిన్ను నీగుణము వర్ణింపఁదరమె?
స్త్రీలపాలిఁట కీవయే దేవివమ్మ వరలుమా గృహలక్ష్మి! వైభవమెసంగ.

మ. లలితాంధ్ర ప్రథమాన సత్కవివచోలావణ్యముల్ జూపి, స
త్కళలెల్లన్ బ్రకటించి లోకమున విఖ్యాతిన్ విడంబించి నీ
తలపుల్ సాధ్వుల కెల్ల మేలొసఁగు తత్వంబంచుఁ బేర్గాంచితీ
విల నింకేమి కొఱంతనీకు గృహలక్ష్మి! కాంచుమభ్యున్నతిన్.

గీ. చిలుప చిలుపని తేనియ లొలుకుపలుకు లెలమిఁ బలుకుచు ముద్దులఁ గులికిగులికి
సాటివారలు బులకింపఁ జాటినావు విమలయశమును గృహలక్ష్మి! పృథ్విలోన.



'కవికోకిల'

శ్రీమతి వి. రాధామణిగారు

తమిళసాహిత్యసేవకు గృహలక్ష్మి స్వర్ణకంకణముతో బహూకరింపబడిరి.

ఉ. బాలికవయ్యు బల్ సుకృతభాగ్యమనంతముగాఁగఁ గాంచి నీ
శీలము గొప్పదంచుఁ బరిశీలనఁజేయఁగఁ గీర్తిఁగాంచి, యె
వ్వేళ మెలంగుచుంటివల పెద్దలకున్ దలలోని నాల్కవై
మేలగు నాఁడునాఁడు వినుమీ! పలుమాటలికేల పుత్రికా!

గీ. నవ్య విజ్ఞాన బీజాళి నారువోసి యింటనింటను మొలకలెత్తించినావు
భారతక్షేత్రముననాటి పంటవలఁతి నలరఁజేయుమ గృహలక్ష్మి! ఫలసమృద్ధి.

ఉ. దీవనలేల నీకు కవిధీవరులెందఱో నీకతమ్మునన్
శ్రీ విలసిల్లు మార్గమును జేకొనఁగల్గి రనేకులంచు మో
దావహమైన వ్యాసము లనంతముగాఁగ రచించుచుండ నీ
పావనధర్మమే విజయభాగ్యములందఁగఁ జేయు నెల్లెడన్.

మ. ప్రతివర్షంబునఁ పైఁడికంకణము శ్రీ రత్నాళిలో సత్కళా
వతికిన్ ధన్యయశఃప్రసూనముల దిగ్భామా శిరోరత్న సం
గతిఁ గూర్పంగల తల్లికిన్ విమల విజ్ఞానాతి ధన్యాత్మకున్
మతిమంతుల్ వొగడంగ నిచ్చెదవు నీ మర్యాద సామాన్యమే?

ఉ. కేసరి రత్నగర్భమునఁ గీర్తిగడింపఁగఁ జాలు పుత్రివై
భాసిలు రీతిఁబుట్టితి శుభప్రతిభన్ గనులగ్నమందునన్
నీసరిఁ జెప్పఁగాఁదగిన నేర్పరులందునఁ గానరాదు కై
లాసనివాసుఁ డిచ్చు గృహలక్ష్మి! మహోదయమొందు భాగ్యముల్.

ఉ. నీవొనరించునట్టి కమనీయరసాన్విత పాకపుష్టి ధా
త్రీవలయంబునందుఁ గలదే? రుచిఁజూడని జ్ఞానికోటి బల్
చేవఁగలట్టి వ్యాసములచే నలరారెడు సుప్రతిష్టయే
శ్రీ విభవంబు నీకమరఁజేయుత మో గృహలక్ష్మి పుత్రికా!

మ. ఇహలోకానఁబరంబునన్ బతికి సాహిత్యంబు జేకూర్పఁగా
గృహిణీరత్నమయంచు ధర్మవిదులా కీర్తింతు రేటేటికిన్
బహుమార్గంబుల కామినీగణములన్ బాగోగులన్ దిద్దఁగా
గృహలక్ష్మి! నియమంబుఁ బట్టితివి నిన్ గీర్తింప నేవారికా.

ఉ. ' కేసరి ' తండ్రిగాఁగ బుధకేసరులెందఱో యీ జగాన ని
న్నేసరిఁజెప్పఁగాఁదగును నీకని చెప్పెడి కీర్తికాంతిచే

వాసియు వన్నెఁగాంచితివి; భారతదేశమునాఁడు నాఁటికిన్
భాసిలు నీపథమ్మునఁ బ్రవర్తిలుచో గృహలక్ష్మి పత్రికా!

శా. ఆయుర్భాగ్యముఁగాంచి వర్ధిలుచు నిత్యైశ్వర్యముల్ గాంచుమా
శ్రేయోదాయకమైన భవ్యగుణముల్ చేకూరు మార్గంబు, వి
ద్యాయోగమ్మున బోధసేయు సతివీవంచున్ నిరూపింపఁగాఁ
జేయన్ బూనుమనేకసత్కృతులు వాక్శ్రీలీల లేపారఁగన్.

సీ. విశ్వకల్యాణపవిత్రత నార్జించి గణనకెక్కితివి మంగళము నీకు
తన్వంగి బానిసతనమువో పతికను. రాగమిచ్చితివి భద్రంబు నీకు
ముదితలెల్లరుఁ గళాపూర్ణలుఁగా శేముషీభాగ్యమొసఁగితి శివము నీకు
తెలుఁగుబాసకుఁ జిత్రమలరించి యూడిగాల్ సలిపితి శ్రేయసంబు నీకు

గీ. సకల శుభములఁ గంటి భావుకము నీకు
పండితాదృతిఁ గంటి భవ్యంబు నీకు
జగతిఁ జల్లఁగమనియుండుము గృహలక్ష్మి
పత్రికారాజమా! నూఱు వత్సరములు.



# శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు

(ఈ విషయము "గృహలక్ష్మి" పత్రికా సంపాదకులగు శ్రీ డాక్టరు కే. యన్. కేసరిగారిచే "గృహలక్ష్మి" జయంత్యుత్సవమునాడు సభవారి కెరింగింపబడినది.)

ఈ కవయిత్రి జన్మించిన స్థానము నీలగిరి. చల్లని ప్రదేశమునఁబుట్టి చల్లని ప్రదేశమునఁబెఱిఁగి చల్లనిగాలులను బీల్చుకొనుచుఁ గ్రమక్రమముగ విద్యలయం దారితేరిన నారీరత్నము—ఆంగ్లమునఁ బ్రవేశ పరీక్షయందు త్తీర్ణురాలయ్యె. గీర్వాణమున దక్షిణకాశి యనంబరగు కాంచీపురమున శ్రీమాన్ కంధాడై కృష్ణమాచార్యులగారివద్ద పంచకావ్యములు, నాటకాలంకారములు చదివి పాండిత్యము సంపాదించిన విదుషీమణి. ఆయుర్వేద సార్వభౌముండగు పండిత గోపాలాచార్యులగారివద్ద రెండు సంవత్సరములు వైద్య విద్యయందు కృషిసల్పె. హిందీలో రాష్ట్రభాషాపరీక్షలో కృతార్థతఁగాంచె. ఈనాఁడు పరీక్షలు ప్యాసగుట యొక లెక్కలోనిది కాదు. పరీక్షార్థమై కేవలము పఠనీయగ్రంథములు మాత్రమే చదివి యెట్లో జయపత్రమును గాంచిన వారిలో నీయమ చేరదు. హిందీ గీర్వాణగ్రంథములు యాలిపిలోనే యనర్గళముగఁజదివి యెట్టి గ్రంథమైనను సులభముగ సారమెఱుంగుటయేకాక యితరులకు బోధింపఁగల సమర్థతగాంచిన విజ్ఞానమీ ధన్యచరిత్ర సంపాదించె. పురుషులమాట యటుండ, స్త్రీలలో నింతటి బుద్ధిపాటవముగాంచిన వారలరుదు. బుద్ధి సూక్ష్మతలోఁ బలువురుండవచ్చునుగాని యిన్ని విద్యలలో నారితేరిన వారలు బొత్తిగా తక్కువయని చెప్పుట సాహసవాక్యముగాదు. ఇంక జ్యోతిషవిద్య కరతలామలకముగఁ జెప్పగల నిపుణురాలు. సాముద్రికమందును నేర్పుగలదు. విశేషించి చక్కని కవయిత్రి. శ్రీ జటప్రోలు సంస్థాన రాజగురువులును, స్నేహలతాకవితా సంఘాధ్యక్షులునునగు వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారు వీరి కవితాగురువు. వీరు రచించిన గ్రంథములు పతివ్రతాశతకము, శ్రీ సరస్వతీశతకము, ఆత్మోపదేశము, సత్యనారాయణవ్రతకల్పము, సరస్వతీరామాయణము. సరస్వతీరామాయణము ఉత్తర కాండముతో సహా 1200 పద్యములతో నలరారుచున్నది. చెన్నపురి విశ్వవిద్యాలయము వారిచేఁబఠనీయ గ్రంథముగ నెన్నుకొనఁబడి సాహిత్యలోకమునఁ గీర్తి నార్జించిన గ్రంథమిది. రామసుబ్బారాయఁడుగారిచే రచింపఁబడు 'మిత్రలేఖల'చేఁ బ్రోత్సహింపఁబడి శ్రీశ్రీ మిర్జాపురరాణీగారి యంతఃపుర బాలికామణులకు విద్యాబుద్ధులు గఱపుచు రెండు సంవత్సరములలో వ్రాయఁబడిన కావ్యమిది. శ్రీ మిర్జాపురరాణీగారే యీ కావ్యమును బ్రకటించి, వీరి కృషిఫలవంతముజేసి ప్రోత్సయించుట యటుండ, ఆంధ్ర సారస్వతలోకమున కిట్టి చక్కని కృతిఁనందఁజేసిన పుణ్యమునుగూడ నార్జించిరని చెప్పవచ్చు. సర్వకళా

ప్రవీణులగు విద్యావారిధి కాశీ కృష్ణాచార్యులవారి యభిప్రాయమిట నుదాహరించిన నీ కవయిత్రి కవితానైపుణ్య మిట్టిదని చెప్పనక్కఱలేదని మా ఆశయము.

చ. కలరు కవిత్వమల్లఁగల కాంతలు కొందరు ధారుణీస్థలిన్
గలిగిననేమి వారి కవనంబులఁగొన్నిఁటి వింటిఁగాని యీ
చిలుకలపల్కు టల్లికలచే నలరారుచుఁ బూలతేనె చు
క్కలఁగురియించు మేలయిన కైత సరస్వతి! నీకె చెల్లెడున్.

ఉ. పోలికలేని మేలయిన పోకలఁబోయెడు నీకవిత్వ పుం
జాలు సుధారసాలనఁగఁ జాలుఁబదాలిఁక జాజిపూలనం
జాలును సొమ్ములన్న సహజాలు వరాల సరాలసేలు, చే
బ్రోలు సరస్వతమ్మ నినుఁబోలిన మొల్లయు పోలెడుంజుమీ.

క. కృతితెన్గఁట శ్రీరాముని
కథయఁట, విషయంబు దాని కవయిత్రి సర
స్వతియఁట, పద్యములు నహి
ప్రతియఁట, నీ భాగ్యమేమి రామాయణమా!

ఈ సాధ్వీమణిపుట్టినవంశము మెట్టినవంశము విద్వద్వంశమె. ఈమెతండ్రిగారు నీలగిరిలోనే సుప్రసిద్ధ న్యాయవాదులై కీర్తిగాంచిన మహారాజశ్రీ కీ॥ శే॥ రాజగోపాలనాయుడుగారు. ఈమె భర్తగారగు మహారాజశ్రీ చేబ్రోలు రాజగోపాలంగారు ఆంగ్ల విద్యాపారంగతులు. చక్కనివక్త. జ్యోతిష వేదాంతశాస్త్రములు వీరి అభిమానవిద్యలు. అందులో వీరికిఁగల జ్ఞానమపారము. వీరి ఆచారమా 'దయాసత్యశౌచ' కర్మనిష్ఠాగరిష్ఠులని లోకనుతిఁగాంచిన సాంప్రదాయము. సార్థకనామధేయమునుగాంచిన సరస్వతీదేవిగారి బహుభాషావైశద్యమును దిలకించుచో "ముదితల్ నేర్వఁగరాని విద్యగలదే ముద్దార నేర్పించినన్"అను చిలకమర్తి కోకిల వాక్యధ్వని స్ఫురణకు రాకమానదు. ఇంతటి కీర్తికి స్థానమై యలరారుచున్న శ్రీ సరస్వతీదేవిగారికి యీ సంవత్సరము గృహలక్ష్మికంకణము సమర్పింపఁబడుటకు నేను నిర్ణయించితిని గనుక పాఠక మహాశయులకును ముఖ్యముగా గృహలక్ష్మి పత్రికాభిలాషులగు గృహలక్ష్ములకును దెలియఁబరచుచున్నాను. శ్రీ సరస్వతీదేవిగారీ కంకణమును ధరించి స్త్రీ విద్యావ్యాప్తికై, స్త్రీ సంఘాభివృద్ధికై, యనువగు కావ్యములను రచించుచు, నుపన్యాసవేదికలఁ దన్మార్గమును వెల్లడించుచు, పత్రికాద్వారమున బోధించుచు, భారతదేశ సౌభాగ్య భాగ్యోన్నతికై సేవజేసి కీర్తి నార్జించుఁగాక యని ఆశీర్వదించుచున్నాను.

# గృహలక్ష్మీ జయంతి మహోత్సవము

ఈ మహోత్సవము ఈ నెల 1-వ తేదీ శుక్రవారం సాయంకాలం 4½ గంటలకు సరిగా ప్రారంభమైనది. పురప్రముఖులును గృహలక్ష్మీ పత్రికాభిమానులును స్త్రీ పురుషు లనేకమంది విచ్చేసిరి. ఉత్సవమునకు వచ్చినవారందరును చందనతాంబూలాది సత్కార ములచే గౌరవింపబడిరి. శ్రీమతులు గుమ్మిడిదల దుర్గాబాయి, చేబ్రోలు సరస్వతీదేవి, వి. రాధామణిగార్లు పుష్పమాలాలంకృతులైన పిమ్మట స్త్రీల సమూహముయొక్క ఛాయా చిత్రము తీయబడెను. తరువాత శ్రీ కుమారి సరోజినీదేవి, అవ్వాయిహోమ్ బాలికలచే గావింపబడిన ప్రార్థనతో సభ ప్రారంభింపబడెను. ప్రార్థనానంతరము సభకు అధ్యక్షు రాలుగ నెన్నుకొనబడిన శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయి బి. యే.(ఆనర్సు)గారు, గృహలక్ష్మీ స్వర్ణకంకణ గృహీతలుగ నిర్ణయింపబడిన శ్రీమతులు చేబ్రోలు సరస్వతీదేవిగారును, వి. రాధామణిగారును సభాపీఠిక నలంకరించిరి. సభాధ్యక్షురాలిని సభ కెఱుకపరచుచు శ్రీ ఏడిద కామేశ్వరరావుగారు, అధ్యక్షురాలి విద్యాధిక్యతను, దేశసేవా విశేషమును, ఉన్నతాదర్శ ప్రేరితమగు సంఘసేవాతత్పరతను, అసమానధీచాతుర్య ధైర్యస్థైర్యాది సద్గుణగణమును సవిస్తరముగ ప్రశంసించిరి. పిమ్మట శ్రీ విం. అ. సూర్యనారాయణగారు "గృహలక్ష్మి" పదమూడవ జన్మదినోత్సవ సందర్భమున ఈ పత్రికా కుమారి పురోభి వృద్ధిని, విజయమును దీర్ఘాయువును గోరుచు అభిమానులును విద్యాధికులును అగు స్త్రీ పురుషులు పంపిన సందేశములను సభవారియెదుట చదివిరి.

తదుపరి శ్రీ "గృహలక్ష్మి" పత్రికాధిపతులును, సంపాదకమహాశయులును అగు శ్రీ డాక్టరు కేసరిగారు కంకణగృహీతలలో నొకరగు శ్రీమతి చేబ్రోలు సర్వతీదేవిగారిని సభవారి కెరింగించిరి. శ్రీమతి అంబుజమ్మాళ్ గారు తమిళ కంకణగృహీతయగు శ్రీమతి వి. రాధామణిగారిని సభవారికి తెలియజేసిరి.

తదనంతరము శ్రీమతి కవితిలక కాంచనపల్లి కనకాంబగారు శ్రీమతి సరస్వతీదేవీ కృత రామాయణ గ్రంథప్రాశస్త్యమును సోదాహరణముగ విశదీకరించుచు 'కవికల హంసి'అను బిరుదమును, శ్రీమతి వి. రాధామణిగారి 'ప్రసన్న కుమారి' నాటకము లోని రచనాకౌశలమును, సంగీతనైపుణ్యమును వివరించుచు, ప్రవీణశబ్దము నకువ్యుత్పత్తి వీణా వాయిద్యమునందలి నైపుణ్యముగ నిరూపించుచు సంగీతసాహిత్య మాధుర్యములను వెలయించు 'కవికోకిల' బిరుదమును, సభవారి తరఫున ప్రదానము గావించిరి.

బిరుదప్రదానమైన పిమ్మట శ్రీ డాక్టరు కేసరిగారు ఇరువురు విదుషీమణులను 'గృహలక్ష్మి' పాఠకుల తరఫున స్వర్ణకంకణబహూకరణముచే సత్కరించిరి. కంకణ గృహీతలు సందర్భమునకు సరియగునటుల శ్రీ కేసరిగారియెడ తమ కృతజ్ఞతను గౌరవ పురస్సరముగ వెల్లడించిరి.

కార్యక్రమము ననుసరించి పిమ్మట ఉపన్యాసములు జరిగెను. తొలుదొల్త 'గృహలక్ష్మి' పత్రికకు చిరపరిచితులును, సుప్రసిద్ధ వ్యాసరచయితులును, కవితాకళోపాసకులును అగు శ్రీ గోనెల నరసింగరావు ఎం.ఏ. బి.యల్. గారు గృహలక్ష్మిపత్రిక యొక్క ఘనత నుగ్గడించుచు భావగర్భితమగు భాషాచాతుర్యముతో గూడిన గంభీరోపన్యాస మొసంగిరి. వారి తరువాత తమిళ గృహలక్ష్మిపత్రికా సంపాదకులగు శ్రీ యస్. కృష్ణన్ బి.యే. (ఆనర్సు)గారుపన్యసించిరి.

సభామధ్యమునుండి కరతాళధ్వనులు చెలరేగ శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయి గారు భారతదేశస్వాతంత్ర్య సంపాదనకు స్త్రీలే యర్హులనియు, అట్టి స్త్రీలు విద్యాధికులై యుండు టెంతయు అవసరమనియు, అట్టి విద్యాధిక్యతను సారస్వతసేవావిశేషముచే వెల్లడింపవలెననియు ఉన్నతభావోద్రేకపూరితమగు గంభీరోపన్యాసమును గావించి, సభవారిని ఆనందాబ్ధి నోలలాడించిరి.

అధ్యక్షోపన్యాసానంతరము శ్రీ పండిత దోమా వేంకటస్వామిగుప్తగారు కంకణ బహూకరణోత్సవ కర్తలగు శ్రీ కేసరిగారి సత్కీర్తిని కొనియాడుచు, కంకణశబ్దములోని యర్థమును బహుచమత్కృతితో వివరించుచు ఆశువుగా సభలో పద్యమును జదివిరి.

తరువాత ఆంధ్రసారస్వతశేముషీ సంపన్నులగు శ్రీ ఆదిపూడి సోమనాథరాయకవి వరేణ్యులు స్త్రీత్వములోని ఘనతయు, మాతృత్వములోని మహిమయు ఏ దేశములో పూజింపబడునో అట్టి దేశము మహోన్నతదశ నొందగలదని వీనులవిం దొనర్చు నుపన్యాసమును గావించిరి. తరువాత మద్రాసు శాసనసభాధ్యక్షులును ఆంధ్రమహాసభాధ్యక్షులును అగు శ్రీయుత బులుసు సాంబమూర్తిగారు దేశపరిస్థితులను కూలంకషముగ దెల్పుచు దేశసౌభాగ్యమునకు స్వాతంత్ర్యమే ముఖ్యాధారమనియు, అట్టి స్వాతంత్ర్యమును విదుషీమణులే సంపాదింప సమర్థులనియు అట్టి వైదుష్యమున కాటపట్టైన 'గృహలక్ష్మి' పట్టిని స్త్రీలోకమున కర్పించి, స్త్రీ విద్యా సత్కారగౌరవముల గావించుచున్న శ్రీ కేసరిగారి వితరణ వైభవము నఖండముగ ప్రస్తుతించుచు నుపన్యసించిరి.

ఉపన్యాసములు ముగిసినతోడనే 'కవికోకిల' వి. రాధామణిగారు తమ వీణాగాన సుధాధారారస ప్రవాహములో సభ్యుల ముంచితేల్చి, శ్రీ కేసరిగారు కంకణబహూకరణ సమయమందు సరస్వతీశబ్ద వ్యాఖ్యానవివరణ మొనర్చుచు ప్రసాదించిన "వీణా సహిత సరస్వతి"యను ప్రత్యేక బిరుదమును సార్థకపరచిరి. ఆమె సోదరియగు శ్రీ కుమారి విమల తన వేణుగాన నైపుణ్యమును ప్రదర్శించి శ్రీ కేసరిగారిచే బహుమానింపబడిన బంగారు పతకమునకు పాత్రురాలైనది. కడపట సభాధ్యక్షురాలికిని, ఉపన్యాసకులకును, ఆశీస్సులనంపినవారికిని సభవారికిని గృహలక్ష్మి కృతజ్ఞతాపూర్వకవందనము లర్పించుట తోడనె శ్రీమతులు టి. యస్. ఆర్. రుక్మిణిఅమ్మాళ్, బెంగుళూరు నాగరత్నమ్మగార్ల మంగళములతో, శ్రీ కేసరిగారికి జయజయ ధ్వానములతో సభ శుభప్రదముగ ముగిసినది.

## శ్రీయుత ఏడిద కామేశ్వరరావుగారి స్వాగతోపన్యాసము

సోదరీ సోదరులారా!

ఈవేళ గృహలక్ష్మి పుట్టినరోజు. ఈ పుట్టినరోజు పండుగను జరుపుకొని, ఆ ఆనందాన్ని అనుభవించడానికి మన మిక్కడ సమావేశమవడం నేడు శుభదినం.

ఈ గృహలక్ష్మి జన్మదినోత్సవాన్ని పురస్కరించుకొని గృహలక్ష్మి జనకులైన డాక్టరు కేసరిగారు, సాహిత్యకళయందారితేరిన ఇరువురు విదుషీమణులను సభారంగాన్ని పూజించి, గృహలక్ష్మి స్వర్ణకంకణాలతో సమ్మానించడానికి పూనుకొనడంచేత వారి సహజ దాన వీరత్వాన్ని చాటుకొనడమే కాకుండా, ఇట్టి మహత్కార్యానికి వారు మార్గదర్శకులౌతున్నారు. ఇందుకు ఆంధ్ర, తమిళ మహిళాలోకమేకాక భారతమహిళా ప్రపంచం ఏవత్తూ సర్వదా కృతజ్ఞులై వుంటారు.

నేడు మన సమావేశానికి అధ్యక్షురాలైన శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారికి, శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారికి, శ్రీమతి వి. రాధామణిగారికి మీ అందరి తరఫున స్వాగతాన్నిస్తూ, అధ్యక్షురాలిని సభ కెరుకపరచడానికి నాకీ అవకాశాన్ని కలగ జేసిన శ్రీ డాక్టరు కేసరిగారికి నేనెంతయు కృతజ్ఞుణ్ణి.

శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారిని గురించి నేనిప్పుడు చెప్పబోవడం, అందులోనూ చెన్నపురి పౌరులకి తెలియబరచడం, చంద్రుణ్ణి దీపపుకళికతో చూపించినట్లుంటుంది. అయినా, శ్రీ దుర్గాబాయమ్మగారివంటి ఆదర్శవ్యక్తిని గురించి చెప్పబోవడం ఆ ఆదర్శానికి ఒకవన్నె కూర్చడమన్నమాట.

దుర్గాబాయమ్మ దేశసేవాపరాయణ, త్యాగశీల. విద్యావైదుష్యములోను, సాంఘికసేవాతత్పరతలోను వన్నెకెక్కినమిన్న. పువ్వు పుట్టినప్పటినుంచి సువాసన బయలు దేరునట్లుగా యీమె సాంఘిక దేశసేవాభావాలు చిన్నప్పటినుంచి యీమెలోంచి వెల్లి విరిశాయి. కాకినాడలో యీమెచే స్థాపింపబడిన హిందీపాఠశాల యీమె సాంఘికసేవాసక్తికి ఒక ప్రబలనిదర్శనం. పదిమంది పిల్లలను పోగుచేసి, స్వంతఖర్చుతో ప్రారంభించిన ఆ పాఠశాల వందలకొలది బాలబాలికలను ఆకర్షించింది. పురప్రముఖులందరు సెభాసని మెచ్చుకున్నారు. అప్పటికి యీమెకు 15 ఏళ్లే వయస్సంటే దుర్గాబాయమ్మగారి సాంఘిక సేవాసక్తి అర్థమౌతుంది.

ప్రాథమికవిద్య అయినా పూర్తికాకపోయినప్పటికీ, స్వయంకృషిమీద తెలుగు, ఇంగ్లీషు, హిందీ మొదలైనవన్నీ నేర్చుకుంది. దరిదాపు 20 ఏళ్లు వచ్చేవరకు ఆ హిందీ పాఠశాలను నిర్వహిస్తూ, అందరికీ హిందీని ఎంతో నైపుణ్యంతో బోధిస్తూ, స్వవిద్యాభివృద్ధికి నిరంతరకృషిచేస్తూ, చెన్నరాజధానిలో హిందీప్రచారాన్ని సాగించి మహాత్ముని ఆశీర్వచనలకి పాత్రమైనదంటే యీమె నిర్మాణకార్యదీక్ష విదితమౌతుంది.

ఈమె దేశసేవాశక్తి, సాంఘికసేవాభిలాష, నిర్మాణకార్యదీక్షానిపుణత ఒకఎత్తు, యీమె త్యాగధైర్యస్థైర్యాలు ఒకఎత్తు—

1930 లో మద్రాసు సముద్రతీరాన్ని నాటి ఉప్పు సత్యాగ్రహసమరంలోని యీమె దుర్గావతారం భారతదేశ స్వాతంత్ర సమరచరిత్రలో మరపురాని ఒక మహత్తరాధ్యాయము. ఏ వార్తాపత్రికచూచినా, ఏ ఉపన్యాసవేదికమీద విన్నా యీ దుర్గామహాశక్తి ప్రశంసలే. నాటి సన్నివేశం ప్రభుత్వాన్నికూడా ఒకవూపు వూపిందంటే దుర్గాబాయమ్మగారి త్యాగధైర్యాలు విశదమౌతాయి.

అన్నిటికంటె ఆశ్చర్యకరమైన విషయం—యీమె విద్యాపరిశ్రమ. మొన్నమొన్నటివరకు ఇంగ్లీషుభాషాజ్ఞానము ఏమీలేకపోయినా, హిందూ విశ్వవిద్యాలయపు ప్రవేశపరీక్షకు కట్టి, ఆరుమాసముల వ్యవధిలో పరిశ్రమచేసి, రెండవతరగతిలో ఉత్తీర్ణురాలై ఉపకారవేతనాన్ని పొందిన యీమె పట్టుదల, నిశితబుద్ధి, విస్మయాన్ని కలిగిస్తాయి. కాశీ హిందూ విశ్వవిద్యాలయంలో ఇంటర్మీడియేటు పరీక్షయం దుత్తీర్ణురాలై ఆంధ్ర విశ్వవిద్యాలయంలో రాజకీయము ప్రధానంగా బి. యే. ఆనర్సుపట్టాన్ని సంపాదించి అనేక బంగారుపతకాలను బహుమానంగా బడసి, నేడు మద్రాసు లాకాలేజిలో చదువుచున్నదీమె. త్వరలో న్యాయవాదినిగా యీమె బుద్ధిచాతుర్యసౌరభము ప్రపంచంలో వ్యాపింపబోతూవుంది.

ప్రస్తుతం లాకళాశాలలో చదువుతూ, ఆంధ్రమహాసభ—స్త్రీలశాఖ విషయంలో యీమె చేస్తూన్న కృషి అందరికి తెలిసియేవుంది. దీనికి మద్రాసాంధ్రమహాశయులు సర్వదా కృతజ్ఞులైవుంటారు.

దుర్గాబాయమ్మ ఆదర్శయువతి. నేటి క్లిష్టపరిస్థితులలో నిలకడలేక సంచరిస్తూన్న యువతీలోకానికి యీమె ఒక ఆశాజ్యోతి. దుర్గాబాయమ్మ ఎక్కడవున్నా అక్కడ చైతన్యం ఉద్భవిస్తుంది. యువతీయువకుల్లో కార్యదీక్షను ఇనుమడింపజేసి, వారికి మార్గదర్శినియై, ఎట్టి కష్టభూయిష్ఠమైన కార్యాన్నైనా ఎదుర్కొని ముందుకు చొరుచుకొనిపోయే వాడిమెదడుగల దుర్గాబాయమ్మ పౌరుషేయముగల ఒక శక్తిస్వరూపిణి.

ఆంధ్రాంగ్ల హిందీసాహిత్యాల్లో ప్రతిభావంతమైన ప్రవేశం, సంగీత నాట్యకళాది లలితకళల్లో చక్కని నేర్పు, బీరుపోని నిర్మాణ కార్యదీక్షానిపుణత, నిస్తేజమైపడివున్న ప్రజానీకంలో అగ్నిని రగుల్కొల్పగల ధీరవాక్చాతుర్యంగల దుర్గాబాయమ్మ మూర్తీభవించిన ఆదర్శ ఆంధ్రయువతి.

ఇటువంటి దుర్గాబాయమ్మ నేడు మన సమావేశానికి అధ్యక్షత వహించడం కేవలం మన భాగ్యము.

నేడు యీ సభారంగాన్ని ఒక చిత్రమైన సన్నివేశం సమకూరింది—

## గృహలక్ష్మీ జయంతి మహోత్సవము



సభకు విచ్చేసిన స్త్రీ పురుషులు

గృహలక్ష్మీ జయంతి మహోత్సవము



అధ్యక్షురాలు, కంకణగ్రహీతలు, తదితర విదుషీమణులు.

## గృహలక్ష్మీ జయంతి మహోత్సవము

కవులు భావవీధుల్లో విహరిస్తూ దేశకల్యాణానికి పనికివచ్చే వస్తుసముదాయాన్ని సేకరించుకొని, కావ్యరూపంగా మథించి, కార్యరూపందాల్చడానికి అనుగుణ్యంగావుండేటట్లు చిత్రించి ప్రజానీకానికి అందిస్తారు. దేశసేవాధురంధరులైన త్యాగశీలురు వాటిని కార్య రూపాన్ని పెట్టి విశ్వమానవ కల్యాణానికి తోడ్పడతారు.

ఇందొకరు చెప్పేవారు, రెండోవారు చేసేవారు. ఈ చెప్పుచేతలకి సాంత్యంగ ఇక్కడ లభ్యమైంది. శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవి శ్రీమతి వి. రాధామణిగార్లు మానవా భ్యుదయానికి దోహదమునిచ్చే ఉద్గ్రంథాలను చిత్రిస్తారు. చెప్పనూగలదు, చెప్పినదానికి పదిరెట్లు చేయనూగలదు, యోధురాలు దుర్గాబాయమ్మగారు.

ఇటువంటి ఉత్తమశక్తులు రెండు యీ సభావేదిక నలంకరించడంచేత బంగారానికి తావి అబ్బినట్లుంది.

పుట్టినదాదిగా సాంఘిక దేశసేవలే పరమావధిగా పెట్టుకుని, వాటికే తనజీవితాన్ని అంకితంచేసిన 'శ్రీ గృహలక్ష్మి' జయంతి మహోత్సవంలో, ఇరువురు సాహిత్యసేవా పరాయణలను 'గృహలక్ష్మి స్వర్ణకంకణాల'తో శ్రీ కేసరిగారు సన్మానిస్తూన్న యిట్టి మహాసభకు, దేశసాంఘిక ఔన్నత్యంకొరకు పాటుపడుతూవున్న ఇరువురు కవితామతల్లు లను ఇరువైపులాధరించి దేశకల్యాణ సౌధాగ్రముగామికాబోతూవున్న దుర్గాబాయమ్మగారి ఆధ్వర్యాన్ని యీమహాసభను దిగ్విజయంగాజరుపకోరుతూ యింతటితో విరమిస్తున్నాను.

## శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి అధ్యక్షోపన్యాసము

డాక్టరు కేసరిగారూ, సోదర సోదరీమణులారా!

నన్ను అధ్యక్షురాల్ని చేసినందుకు మీకు నా ధన్యవాదాలు. ఇది సామాన్యమైన సభకాదు. మన రాష్ట్రానికి చెందిన విదుషీమణులకు సన్మానించడానికి సమావేశమైన మహత్తరమైనసభ. నావైదుష్యం, నా సోదరీసేవాపరాయణత్వం యెలావున్నా—ముఖ్యంగా కేసరిగారికి నాయందుగల ఆదరాభిమానాలు నాకీగౌరవం ప్రాప్తించడానికి కారణం అని తలుస్తాను. మొట్టమొదట ఆంధ్రసోదరీమణుల తరఫున గృహలక్ష్మిద్వారా, డా. కేసరిగారు స్త్రీ జనోద్యమానికి చేస్తూన్న అమూల్యమైన సహాయానికి కృతజ్ఞత తెలుపుతున్నాను. స్త్రీలు వెనుకబడి ఉండటమే సంఘమందలి చెడుగులకి మూలమని వీరు చక్కగా గ్రహిం చారు. భారతమహిళాదర్శాలని చాటించడానికి గృహలక్ష్మిని లేవనెత్తారు. కష్టనష్టాలు గణించకుండా పత్రికను నిర్విఘ్నంగా కొనసాగిస్తున్నారు.

సంఘం ఉన్నతికి, సాంఘికుల వీరారాధనకి అవినాభావసంబంధముంటుంది. తన మహామహుల్ని గుర్తించి, గౌరవించడం సంఘం ముఖ్యధర్మం. ఈ ఉత్సవం చాలా ఆవశ్యకమైంది. నేడు మనం ఇక్కడ గొప్ప కవయిత్రులను సన్మానించి మన విధ్యుక్తధర్మాన్ని నెరవేర్చటానికి కలుసుకున్నాం.

ఇలాంటి సన్మానోత్సవాలు మనకి అనూచానంగా వస్తూన్నవే. కృష్ణదేవరాయల కాలంలో కంకణబహూకరణం, కవిపూజ సామాన్యమైన విషయంగా మనం ఎరుగుదుము. మొన్నమొన్నటివరకు మహారాజులు, జమీందారులు, పండితులు, కవులు మొదలైన వారిని యథోచితంగా సత్కరిస్తూరావడం చూశాం. కాని స్త్రీలలో విద్యాప్రవీణలగు వారికి సత్కారగౌరవములు చేయు ఆచారము అంతగా కానరాదు. ఇప్పుడు విదుషీమణులను స్త్రీ విద్యాభిమానులగు శ్రీ కేసరిగారు స్వర్ణకంకణబహూకరణములచే గౌరవించుట ప్రశంసనీయమైన నూతన మర్యాద. కాలం దొర్లిపోతోంది. ఇవి ప్రజాయత్త పరిపాలనా దినాలు. హక్కులు గుర్తింపగలిగిన ప్రజాసామాన్యం బాధ్యతలుకూడా వహించాలి. నాగరకత హెచ్చినకొద్దీ, నాజూకుతనం బలిసి, సత్సాంప్రదాయాలు మూలపడిపోతూండడం శోచనీయం. సంఘానికి తలమానికాలనదగిన కళాశాలుల్ని కీర్తించడం మనవిధి. ఇది చాలా పవిత్రమైన కార్యం.

శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు ఈనాటిమొల్ల. ఆమె మిక్కిలి సంస్తవనీయురాలు. ఆంధ్ర సారస్వతానికి, ఆంధ్రదేశానికి ఆమెచేసినసేవ మరువరానిది. కవిలాగే 'జర్నలిస్టు'కూడా సంఘానికి వెలుగుదారి నిస్తాడు. కవి భావనాలోకంలో విహరిస్తాడు; ఆదర్శాలందిస్తాడు. జర్నలిస్టుకి మామూలు ప్రపంచంతో నిరంతరసంబంధం. అంతేతేడా. ఇద్దరూ అపురూపమైన సంఘసేవా తత్పరులే. సరస్వతీదేవిగారు మంచి 'జర్నలిస్టులు' కూడా. ఆమె ఉన్నలోపాలు సరిగా తెలుసుకుని, సంఘాన్ని చాకచక్యంతో మరమ్మతు చేయగల సమర్థురాలు. సంఘం అరాజకమైన తొందరలోపడి తొక్కులాడే వేళల్లో ఆగి, తాపీగా ఆలోచించమని చెబుతారు; నిశ్చలంగా, నిర్జీవంగా పడిఉన్నప్పుడు తట్టి మేలుకొలిపి, హుషారుచేస్తారు. జర్నలిస్టయిన సరస్వతిగారు మన నేస్తం, మంత్రి, మార్గదర్శిని అవుతున్నారు.

అసలు ఈ జర్నలిజానికి ఎవరెక్కువ తగుదురు? స్త్రీ. మగవాడెప్పుడూ కాదు. నిత్యజీవన సంరంభంలోనే మగవాని జీవితం కడతేరుతోంది. ఇంక జర్నలిస్టుకి కావలసిన నిమితమైన విచారణ, నిస్స్వార్థమైన ఆలోచన, నిశితమైన విషయపరిశీలన_వీటికి యెక్కువ పెట్టిపుట్టింది స్త్రీ. మగవాడు సహజంగా యేవో హడావిళ్లతో ఉక్కిరిబిక్కిరి అవుతూంటాడు. జీవితంఅంతా ఒకపందెంవేసిన పరుగులా ఉంటుంది అతగానికి. స్త్రీకి మాతృత్వం జన్మహక్కు; ప్రకృతిసిద్ధం. సంఘం ఒకపెద్ద సంసారంలా కనిపిస్తుంది ఆమెకి. తనుకన్నపిల్లల్ని ఎంత నిర్మలమైన ప్రేమతో పెంచగలుగుతుందో, సంఘం యావత్తూ అంతపదిలంగా చూసుకుంటుంది. సరస్వతి, రాధామణిగార్లు ఈ భావం బాగా అవగాహన చేసుకుంటారనుకుంటాను. జర్నలిస్టు భాషకోసం బాధపడనక్కరలేదు. భావాలుఉన్నచోట భాష ఎవరికోసం వస్తుంది? పొట్టకోస్తే అక్షరంముక్కలేని గొడ్లకాపర్లు పసందైనపాటలు పాడతారు పాటలుకట్టి. నీలమైన ఆకాశం, పచ్చనిబయళ్లు, నున్నని కొండలు, మేసేపసులు-ఇవి

# గృహలక్ష్మి జయంతి మహోత్సవము

పాఠకజనాన్ని కవుల్నీ, గాయకుల్నీ చెయ్యడంలేదు? జర్నలిస్టు పనులకావర్లకి తీసి పోయాడా? ప్రస్తుతసంఘాన్ని ఒకసారి సింహావలోకనం చెయ్యండి. స్త్రీ లెంత దౌర్భాగ్య స్థితిలో ఉన్నారు? పాశ్చాత్యదేశాలన్నీ 'కొత్త ప్రపంచం, కొత్త ప్రపంచం'అని ఉద్ఘో షిస్తున్నాయే-వాట్లకి మొన్నో కొత్త ప్రపంచాలు పుట్టింతరువాత కూడా మనం ఇంకా ఎక్కడ ఉన్నాం? ఆదేశాల్లో ఏ పద్నాలుగో శతాబ్దంలోనో ఉన్న సంఘస్థితికూడా లేదే మనలో-ఇప్పటికీ స్త్రీకి తనశరీరంమీద తనకి హక్కులేదు. స్వతంత్రజీవనంలేదు-వ్యక్తిత్వం లేదు. ఇక ఆమె బాగుపడ్డానికి ఆమె నిరక్షరాస్యత అడ్డువస్తోంది. మన సంఘంలో ఎంత మార్పు చెయ్యాలి? ఎంతో నిర్మూలించాలి. ఎంతో పునరుద్ధరించాలి.

సంఘం దిద్దుబాటుకి నాటకరచన అతిముఖ్యమైన సాధనం. రాధామణిగారు నాటకాలుకూడా రాస్తారని విన్నాను. ఎంత అదృష్టవంతులు! ఆమె తన నాటకరచనా సామర్థ్యంతోటి వాళ్ల బాగుకీ, సంఘం ఉన్నతికీ ఉపయోగిస్తారని నా ఆశయం. మొన్నటి గృహలక్ష్మిలో వారు వీణతోఉన్న Photo ఒకటి చూడ్డం తటస్థించింది. ఆమె సంగీత విద్వాంసురాలుకూడా అన్నమాట! 'మాధుర్యం, కాంతి'-ఔన్నత్యానికి మూలకందా లన్నాడు (Matthew Arnold) రాధామణిగార్లో ఈ రెండు సమకూడినాయి.

మనోవికాసానికీ, ఉత్కృష్టజీవనానికీ ఉన్నతవిద్య అవసరం. ఉన్నతవిద్యఅంటే కేవలం డిగ్రీలుఅనే నాఅభిప్రాయంకాదు. ఎంతపెద్ద చదువుచదువుకున్నా మగవానితో దెబ్బ లాటకి దూకే ఆడది విద్యావంతురాలు కాజాలదు. కేవలం తన సంసారం-తనపిల్లలు, తన భర్త-తన నగలు, తనశరీరం చూసుకునే మనిషీ విద్యావంతురాలుకాదు. స్త్రీలో, ఉన్నత విద్యని ఉత్కృష్టపరిణామానికి ఉపయోగించుకో నేర్చిన స్త్రీలో మానవసేవకోసం మంచి ఉత్సాహం చూస్తాం. మానవసేవ, సంఘోద్ధరణ-సంఘంలో వైకల్యం నిర్మూలించి, సౌందర్యానికి జీవంపోయడం-ఇదే స్త్రీకి ఉచితవికాసం, ఆమెలోని తేజస్సూ, మాధుర్య మూను. ఇట్టి స్త్రీలు ఉన్నప్పుడే సంఘపునర్నిర్మాణం సమకూడుతుంది.

ఈ ఉన్నతవిద్య ఎలా సంధర్భపడుతుంది? విద్య మేధస్సుకి వికాసం కల్పించేది. ఆత్మవికాసంతోడి మేధస్సువికాసం-ఉన్నతవిద్య, ఆత్మ, మేధస్సు ఇవి వేరువస్తువులైనప్పటికీ వీటికి పరస్పరం సంబంధముంది. అభివృద్ధివిషయికంగా, అవి ఒకదానిపైనొకటి ఆధారపడి ఉన్నాయి. పాఠశాల మేధస్సును తరఫీదు చెయ్యడానికి; గృహమూ, సంఘమూ ఆత్మను రూపందించడానికి-వ్యక్తికి సహాయపడుతున్నాయి. కాని సంఘాన్ని నడపడానికి ఒకవ్యక్తి కావాలి. జర్నలిస్టు, కవయిత్రి అయిన మన సరస్వతీదేవిగారు సంఘమార్గదర్శిని అవుతున్నారు. కవులు తమ విధిని చక్కగా నెరవేరుస్తారు. కాని మనం చెయ్యవలసిన దేమిటి? అంతభారం వారికే వదలి, చల్లగా కూర్చుంటామా? ఊహుఁ. మనం చూసుకోవలసిన అవసరమైన పనులు ఉన్నాయి. సంఘ నాయకుల్ని నేర్పుతో అనుసరించడానికి మన

అమ్మాయిలకి తగిన విద్యనేర్పించాలి—నేను పద్ధతులకోసం పోట్లాడను. స్త్రీలకు ప్రత్యేక విద్యాసౌకర్యాలు హెచ్చుచెయ్యడానికి ధనం చాలదని ప్రభుత్వం అంటూన్నపుడు, ఎదిగిన పిల్లల్ని బడికిపోనీయకుండా సంప్రదాయం ఆటంకపరుస్తూన్నపుడు, కుటుంబపరిస్థితులు అనుకూలంగాలేనప్పుడు—మనకు కావలిసింది, అనధికార ప్రయత్నం. ఏవిధంగా? శారదానికేతనంవంటి ప్రయివేటు విద్యాశాలలు ఉన్నవికదా! స్త్రీలకు ఎక్కువ అలాటివి మనం లేవతియ్యాలి. అంతేకాదు. ఆర్గనైజేషన్ అత్యవసరం. దీనికి డాక్టరు కేసరివంటి మహోదారులు పూనుకోవాలి. రాష్ట్రంలో వివిధసంఘములను కట్టుదిట్టంగా నడిపించడానికి—మదరాసులో ఒక కేంద్రసంస్థను నిర్మించాలి. గుంటూరు శారదానికేతనం, నెల్లూరు స్త్రీవిద్యాలయం, ఏలూరు జాతీయవిద్యాలయం, బందరు జాతీయకళాశాల, రాజమండ్రి జాతీయవిద్యాలయం మొదలైనవాటిని దగ్గరికి తీసుకురావాలి. పాఠ్యాలు నియమించడానికి, పరీక్షలు జరిపించడానికి ఒక ఎక్సపర్టుకమిటీ ఏర్పడాలి. ఆంధ్రమద్రాసు విశ్వవిద్యాలయాల్లో స్త్రీలకుండే ఇబ్బందులు తొలగించి, ఈవిధంగా ఇంకో విశ్వవిద్యాలయం తయారుకావాలి. అది సమగ్ర జాతీయవిద్య కాలవాలం. అది నారీశిరోమణులు బయల్దేరడాని కాస్కారం.

కాని సంఘంయొక్క నిజస్థితిని చూడకుండా మనం కళ్లుమూసుకోలేం. అనేకమంది స్త్రీలకి ఈ విద్యావ్యాసంగానికి చిక్కులుండవచ్చును. వారికి ముఖ్యమైన మనశ్శాంతి లేకపోవచ్చు. మొదటపని సాగడానికి వీలులేని ఇతరకష్టాలుండవచ్చు. అటువంటి వీరి సౌకర్యంకోసం—మనం వృత్తివిద్యలేర్పాటుచేసి, ఆ సంబంధమైన శిక్షణ అందుబాటులో ఉండేటట్టు చెయ్యడం అవశ్యకర్తవ్యం. వీరి కావిధంగా కొంత ధనసంపాదనకి వీలుకలిగి, భర్తతోపాటు తామూ సంసారపు ఖర్చుకు సాయపడవచ్చును.

తరవాత, కేసరిగారికి నాదొక మనవి; వారు Compositor-Courses ఆరంభించి, అవసరంగాను, ఉత్సాహంగాను—ఉన్న స్త్రీలకి తమ ముద్రాలయంలో ఉద్యోగాలు కల్పించి హెచ్చరించవలసిందిగా నా కోరిక. జర్నలిజంలో స్త్రీలే ఎక్కువరాణిస్తారని నేను ముందే చెప్పాను. ఆంధ్రవనితల్లో అద్భుతమైన జర్నలిస్టులు బయల్దేరడానికి మిక్కిలి దోహదమవుతుందని నా నమ్మకం.

ఈవేళ ఇక్కడ కలసికొని, మనలో ఇద్దరు మహిళారత్నాల్ని గౌరవించి, మన విధాయకాన్ని నెరవేర్చుకున్నందుకు నాకు చాలా ఆనందంగా ఉంది. ఏటేట మన మిట్టి సత్కారసభలకి సందర్భపడి, దివ్యంగా గడపాలని నా కోరిక. సర్వవిధాల తమ చేయూతనిస్తూ స్త్రీజనోద్యమానికి తోడుపడవలసిందిగా డాక్టరు కేసరివంటి ఉదారులను, సోదర సోదరీమణులను అపేక్షిస్తున్నాను. మనం ఈవేళ మననంచేసుకున్న ఆశయాలు త్వరలో ఫలోన్ముఖాలై-స్త్రీజన సర్వతోముఖవికాసం, సంఘపునరుజ్జీవనం సిద్ధిస్తాయని ఆశపడుతున్నాను.

# స్త్రీలు - భారతదేశము

శ్రీమతి పోణకా కనకమ్మగారు

(రేడియో ఉపన్యాసము)

భారతదేశములో స్త్రీల స్థానము ఎంత ఉత్కృష్టమైన ఉన్నతశిఖరాన్ని అధిష్ఠించినది ఆదర్శనీయులైన పూర్వపు స్త్రీలను స్మరించుకుంటె గ్రహించగలుగుతాము. స్త్రీలశక్తి, ప్రతిభ, విజ్ఞానము, గణ్యత, ప్రతియుగములోను అత్యంతముగా ప్రకాశిస్తూవచ్చినవి. స్త్రీని, మాతృస్వరూపముగా ప్రేమించి సేవించడము ఈదేశములోనే పుట్టినదంటె స్త్రీ ఎంతగొప్పగా ఆరాధింపబడినదో తెలుస్తుంది. ఇందుకు మనము ఎంతైనా గర్వపడతాము. స్త్రీ గృహలక్ష్మియై ప్రతి హక్కులోను భాగస్వామినియయినది. స్త్రీ ఎంత అధిక్యతపొందినదో అంత యోగ్యతచూపినది. కాని స్త్రీల ప్రతిష్ఠ నానాటికి క్షీణమై మరుగుపడిపోతూ వచ్చినది. గృహిణిత్వాన్ని ఒక రాణిగా పరిపాలించే హక్కు, అధికారము, శక్తిపోయి తుదకు ఒక పనిముట్టుగా తయారైనది. మనము ఎవరో ఏమిచెయ్యాలో తెలుసుకునే శక్తికూడ సన్నగిల్లిపోయినది. కొంతమంది ఐశ్వర్యముతో పెద్ద సౌధాల్లో సుఖపడవచ్చు. కొంతమంది చదువుకున్నవాళ్లు వేదికలమీద గౌరవింపబడవచ్చు. కాని, స్త్రీయొక్క స్వత్వాన్ని చెప్పగలిగేది అదిమాత్రమే కాదు.

హిందూదేశముయొక్క ఆదర్శదైవము త్యాగమూర్తియైన పరమశివుడు. పార్వతి అర్ధనారీశ్వరి ఆ రాజేశ్వరి వెండికొండమీద విశ్వమును పాలించినది. ఆ జగజ్జనని శివునితో చేతులుకలిపి బిక్షమెత్తినది. ఆ పరాశక్తి స్మశానవాటికలో తాండవకేళీ సల్పినది. భారతస్త్రీ సమాన స్వత్వానికి ఇంతకంటె నిదర్శనము ఏమికావాలి ?

భారతస్త్రీలలో ఈ స్వత్వము ఎంతవరకు ఉచ్ఛస్థితిలో నిలువగలిగినదో కొంత పూర్వాపరాలు పరామర్శించుదాము.

## సీత

వివేకానంద చెప్పినట్లు భారతదేశములో ఒక్క మనిషియున్నా వానినోట సీత స్మరింపబడుతూ వుంటుంది. సీత హైందవనారీ స్వరూపము. హిందూదేశముయొక్క ధర్మము, లక్ష్యము అంతా ఆ రెండక్షరాల్లో యిమిడివున్నది. ఆదేవి లోకానికి పవిత్రమైన మాతృస్థానమును ప్రసాదించినది. ఆమె ఎంత లావణ్యమయియో అంత సౌందర్యహృదయము. సీతాదేవి నిర్మలజీవితము, త్యాగముతో నిండినది. ఆసహనము సాటిలేనిది. ఆమె శీలము, లోకపూజ్యమైనది. ఆమె మహాసాధ్వి. ఆమె సతీధర్మం ఎంత పరమోత్తమముగా పాలించుకోగలిగినదో ఆత్మగౌరవమును అంత అమోఘముగా నిలుపుకొనగలిగినది. ఆమె క్షమాస్వరూపిణియైన భూదేవి కూర్మిబిడ్డ.

పతి ప్రాణయైన సీత. మహావైభవముతో యువరాజ్ఞీత్వానికి సంసిద్ధమై సీత ఒక్కమారుగా అన్ని వదలివేసి భర్తతో అడవులపాలై అష్టకష్టాలుపడినది. అగ్నిపరీక్షలకు నిల్చినది. సత్యముకోసము ఎంత త్యాగమైనా చేసినది. ప్రాణాధికుడైన పతికికూడా దూరమైపోయినది. కాని, ఆత్మగౌరవమునుమాత్రము విడువలేదు.

పవిత్రమైన తన వ్యక్తిత్వాన్ని గ్రహించలేని రామరాజ్యానికి ఒక ధిక్కారముతో స్వస్తిచెప్పి విశాలమైన మాతృగర్భములో లీనమైపోయినది. ప్రేమతోనిండిన ఆ హృదయములోనుండి చిరునవ్వు వెన్నెలలు చల్లని శాంతినిస్తూ త్యాగమును ఎట్లు ప్రదర్శించినదో అభిజాత్యపూర్ణమైన ఆధీమాకూడ అట్లే ధీరత్వమును వెల్లడిస్తున్నది. ఆసత్తా స్మరించుకుంటేనే మనకెక్కడలేని జీవశక్తి కలుగుతుంది. ఆదేవి అశోకవనములో కృశిస్తూ ఉన్నప్పుడేకాదు. ఋషిపల్లెలో విడిచిపెట్టబడినప్పుడుకూడా శ్రీరాముడికోసమే పరితపించినది. ఆ ఓర్పు అద్భుతము; అయితే ఆమె ఎంతకష్టమునైన సహిస్తుందికాని పరాభవాన్ని భరించలేదు. ఎంత త్యాగమునైన చేస్తుందికాని అపజయాన్ని సహించదు. అశ్వమేధములో రామసేనలపైకి కొడుకులను యుద్ధానికి పంపేటప్పుడు ఆ తల్లి ఆశీర్వాదము, ఆ వీరపత్ని సందేశము; ఏ భారతస్త్రీ హృదయము ఊహింపంగదు.

## రాధ

రాధ ప్రేమస్వరూపము; సర్వము అర్పణచేసి తన్మయముగా ఆరాధించడము రాధ సొమ్ము. ఆభక్తికి, ప్రేమకు భిన్నములేదు. దివ్యమైన ఆ ప్రేమతత్త్వము బాహ్యదృష్టికి అందేదికాదు. అది పరతత్త్వాన్ని గ్రహించి పరిపూర్ణమైనది. ఆమె ప్రేమకు హద్దులేదు. ఆ ప్రేమవాహిని కట్టలుత్రెంపుకుని భగవంతుని మధురమూర్తిని ఆనంద లీలాతరంగాలలో ముంచియెత్తినది. ఆ కల్యాణగుణుని హృదయకమలము ఆనందముతో విరిసి స్వాగత మిచ్చినది. ఆమె ప్రేమఫలితాన్ని కోరినదికాదు. అసలు ఆమెకు ప్రపంచములో ఇంకో వస్తువులేదు. అంతా ఈశ్వరస్వరూపమే. లోకాన్నిముగ్ధముచేసే మనోహరమైన ఆ నిర్మలప్రేమకు పతికూడ పరవశుడైపోయినాడు. ఆ ప్రేమగానములో రాళ్లుకూడా చెమ్మగిల్లినవి. ఆమెకు ఇతరచింత లేకపోవడమేకాదు. ఆలక్ష్యమేలేదు. లోకము తన్ను దూషించినా భూషించినా లెక్కచేయలేదు. ఆత్మతన్మయములో లోకమే తెలియలేదు. అర్ధాంగియైన ఈశ్వరిగాని; విష్ణు హృదయమును అధిష్టించిన లక్ష్మిగాని; బ్రహ్మవాణిని స్వాధీనముచేసుకొన్న సరస్వతిగాని; భగవత్స్వరూపములో కొంతమాత్రమే ఆక్రమించారేమోగాని రాధ సర్వస్వము అర్పించి సర్వము తానే అయిపోయినది. కవులు, గాయకులు, నిరంతరము ఆ ప్రేమదైవతమును మనోహరముగా మధుర గానముచేస్తూ భజిస్తున్నారు.

## ద్రౌపది

ద్రౌపది భారతదేశముయొక్క క్షాత్రధర్మాన్ని ప్రతిష్ఠించిన తేజశ్శాలిని. ఆమె విద్యావివేకములు, రాజనీతి, న్యాయదక్షత, కార్యదీక్ష, ప్రతిజ్ఞానిర్వహణము చాకచక్యముతో ప్రదర్శించిన ధీరసాధ్వి. ధర్మాధర్మములను నిర్వచించి చెప్పగలిగిన ప్రతిభాశాలి. పరాభవాగ్నిని విజయరక్తముతోగాని చల్లార్చనని జడ ముడి వీడ్చి శపథముపట్టిన ద్రౌపది శక్తిస్వరూపము మన కళ్లల్లో విహరిస్తూ పులకలెత్తిస్తుంది. ఆమె పాండవులతో అడవులకు పోతూ, ప్రజలకు చెప్పిన మాటలు ప్రతి అణువులోను ఉజ్జ్వలమై ప్రతిధ్వనించినవి. ఆమె ఎంత రాజసాంగనో అంత క్షమాశీల కూడాను. ప్రతిక్రియలోకూడ ఆమె దయ మంజులకాంతితో ప్రకాశిస్తుంది. అశ్వత్థామ శిరోమణిని శిక్షాశుల్కముగా స్వీకరించేటప్పుడు చూపిన జాలి ఎంత ఉదాత్తమైనది? కౌరవులతో రాయబారములు జరిపేటప్పుడు, ఆ దేవి చెప్పిన మాటల్లో, ఎంత ఔచిత్యముతో ధర్మము, రాజనీతి, ధీరత్వము చూపినది. జూదములో ధర్మరాజు తన్నుకూడా ఓడిపోయినాడని విన్నప్పుడు వేసిన ప్రశ్నలోని న్యాయవివేచన ఆమె బుద్ధికౌశల్యాన్ని వెల్లడిస్తవి. ఆమె సౌశీల్యము రాజకార్య ధురంధ

రత్వాన్ని మించినది. అరణ్యములో సత్య అడిగిన సందేహాలకు యిచ్చిన జవాబులో ఆమె పాతివ్రత్యము, సేవాధర్మము, భక్తి ప్రేమలు విశదమౌతవి.

## రాణీ సంయుక్త

వైదిక, పౌరాణిక యుగాలతో, చారిత్రక నారీమణులుకూడ భారతజాతి దివ్యప్రతిభను హిమాలయ శిఖరాలమీద శాశ్వతకీర్తితో ప్రతిష్ఠింపగలిగినారు. హిందూదేశము పరాధీనమయ్యే సంధికాలములో ఒక దివ్యజ్యోతి ప్రజ్వలించి ధృవతారవలె నిల్చిపోయినది. ఆమె రాణీ సంయుక్త. హిందూదేశంలో కడపటి చక్రవర్తి అయిన పృధ్వీరాజును వరించి, కన్నతండ్రికి విరోధియై, భర్తతోపాటు స్వతంత్రము రక్షించుకోవడానికి నడుముగట్టినది. సంయుక్త నూతన సామ్రాజ్ఞి, క్రొత్త పెండ్లికూతురు, మధుపర్కాలతో మాతృదేశము కోసము హృదయరక్తాన్ని అర్ఘ్యమిచ్చినది.

దేశాన్ని పరులపాలు చేయవద్దని తండ్రిని ప్రార్థించినది. పృధ్వీరాజు గొప్పతనము శ్లాఘించినది. తన హృదయము విప్పి వేడికొన్నది. చేతులార అవివేకముతో చేసే పనియొక్క ఫలితము ఈ జాతిని చిరకాలము నిస్తేజము చేసివేస్తుందని పరితపించినది కాని లాభము కలుగలేదు. సంయుక్త ఈ లోకమును విడిచి సుమారు వెయ్యేళ్లు అయినది. కాని, ఆమె కీర్తికాయము లోకములో సుస్థిరముగా వెలుగులుజిమ్ముతూ, నిలిచియే ఉన్నది.

## రుద్రమదేవి

రుద్రమదేవి తెలుగురాణి. రాజ్యముచేసిన రాణి. తెలుగుగడ్డ, శత్రువుల దండయాత్రల్లో శిధిలమై పోవడానికి ముందు ఓరుగల్లు సింహాసనము కాకతీయ రుద్రమ్మకు పసిడిపూలతో పట్టముగట్టినది. రుద్రమ్మ శక్తి, యుక్తి, సవ్యసాచిత్వము సాధించినది. ప్రజాపరిపాలనలో రుద్రమదేవి మిక్కిలి నేర్పరి. ఆమె కాలములో రాజ్యము సకలసంపదలతో హాయిగా తులతూగినది. తరుణవయస్సులోనే కీర్తిప్రతిష్ఠలతో సామ్రాజ్యమును పాలించి దివంగతుడైన గణపతిదేవుడు రుద్రమదేవి భర్త. దుర్భరమైన వైధవ్యదుఃఖాన్ని కాలకూటమువలె ఒకప్రక్క నిల్పి, కర్తవ్యపరాయణ అయినది రుద్రమదేవి. భారతభూమిలో రాజ్యముచేసిన స్త్రీలలో రుద్రమదేవి ప్రముఖస్థానాన్ని పొందినది. రాజ్యాంగాన్ని సమర్ధతతో నిర్వహించి, ఆంధ్రవైభవానికి యశోమాలికలు కూర్చినవారిలో రుద్రమదేవి ఒకతె. కాకతీయ సామ్రాజ్యానికి ఆ రాణి తిలకమువంటిది.

## మాంచాల

మాంచాల పలనాటి వీరబాల. లావణ్యఖనియైన ఆ తరుణి ముగ్ధసౌందర్యము వికసింపకముందే బాలచంద్రుడు చెప్పుడుమాటలు విని తిరస్కరించినాడు. మనోహరుని ప్రణయావేశాలకు తీయని కలలు కంటున్న మాంచాల సుకుమారహృదయము ఒక్క నిట్టూర్పుతో వీరకాసె బిగించినది. ఆ ధర్మము పాలించడానికి బ్రహ్మచర్యము స్వీకరించినది. తండ్రిచేసే మహాయుద్ధంలో దుమకడానికి పొంగుతున్న బాలుని హృదయరక్తము పైకుబికింది. తల్లిని ఆజ్ఞ కోరినాడు కొడుకు యుద్ధానికి. పుత్రమోహము బంధిస్తున్నను తప్పించుకోలేక ధర్మపత్ని అనుజ్ఞలేకుండా పోవడము వీరధర్మము కాదు, చెప్పిరమ్మన్నది అమ్మ. పూర్తిగా తిరస్కృతయైన మాంచాల సదనానికి విచ్చేసినాడు బాలచంద్రుడు. ఆనందముతో, వెల్లివిరిసిన హృదయముతో ఎదుర్కొని,

ప్రేమాంజలితో పూలుపరిచినది; మోకరించి ఆ లేత పాదాలమీద జగన్మోహనమైన ఆ సౌందర్యముచూచి ముగ్ధుడైపోయినాడు బాలుడు. విశ్వమే మరచిపోయినాడు. బాలచంద్రుని వాంఛ మాంచాల తెలుసుకున్నది. పవిత్రమైన ధర్మాన్ని పాలించబోతూ వచ్చిన ప్రాణేశ్వరుడు వ్యామోహములో చిక్కుకుంటున్నాడని గ్రహించినది. ప్రేమానురాగాలు తొణుకులాడే మందహాసముతో వీరఖడ్గము చేతికిచ్చినది. దేశానికి, ధర్మానికి, సర్వము త్యాగముచేసి, ఆహుతి కావలసిన కర్తవ్యము పురికొల్పి, అమోఘమైన సౌశీల్యాన్ని కాపాడుకున్నది.

దూరమైపోయిన దాంపత్యసుఖము తలవనితలంపుగా అనురాగబంధముతో పైనపైచుకొనిపోయే అపూర్వతరుణములో సర్వము మరచి వివశులయిపోయే సన్నివేశములో నిశ్చలముగా ఆమె చూపిన ఆత్మనిగ్రహము అత్యంత శ్లాఘాపాత్రము.

వెంకమాంబ

వెంకమాంబ విదుషి, కవయిత్రి, భక్తురాలు, యోగిని, జ్ఞాని ప్రేమామృత ప్రవంతులలో ప్రియుడైన కృష్ణదేవుని దివ్యగీతాలు కీర్తించిన మధురభక్తి వెంకమాంబది. (ఆమె శైలి అనర్గళము; ఆ కవితాధార పాటలు పద్యాల్లో తియ్యని తేనెసోనల నూరిస్తూ వివశులచేస్తుంది.) అధ్యాత్మ తత్త్వాన్ని పారము ముట్ట మధించి, ఆత్మానందముతో వేదాంతవీధులలో విహరించినది యోగిని వెంకమాంబ. పురుషులకుమాత్రమే స్వాధీనములనుకొనే వివిధ యోగసాధనాలు తీవ్రముగా అనుష్ఠించినది. ప్రాచీనకాలములో జ్ఞానయోగినులైన మైత్రేయి మొదలగువారివలెనే వెంకమాంబకూడా ఆత్మసాక్షాత్కారాన్ని పొంది తరించినది.

భారత నారీమణులు సతీధర్మము, శౌర్యసాహసాలు, విద్య, మేధాకౌశలము మున్నగువానిలోనే గాక, ధర్మదీక్షవూని మతప్రచారము చెయ్యడములోకూడ ముందంజవేశారు. అశోకచక్రవర్తి కొమార్తె బుద్ధదేవుని అహింసాసిద్ధాంతాన్ని అయిదువందల శిష్యులతో సింహళము, చైనా, జపానువరకూ ధర్మబోధ చేస్తూ ప్రచారము సల్పినది. అనేకమైన మతద్వేషాలు, మూఢాచారాలు, హిందూమతాన్ని గట్టిగా బంధించిన దినాల్లో ప్రేమామృతాన్ని స్వేచ్ఛగా ప్రవహించిన బుద్ధదేవుని అహింసా సందేశానికి ముగ్ధురాలై, రాజపుత్రి పరివ్రాజక అయిపోయినది.

# నీతి సామెతలు

అన్నరసముకన్న ఆదరణరసము మేలు. ఆడితప్పరాదు, పలికి బొంకరాదు.

ఇంటిదొంగను యీశ్వరుడును పట్టలేడు. ఈతచెట్టుక్రింద పాలుత్రాగినను కల్లే అంటారు.

ఉద్యోగము పురుషలక్షణము. ఊరికంతావకదోవ వురిపికట్టకు ఒకదోవ

ఋణశేషము, వ్రణశేషము, శత్రుశేషము వుంచగూడదు. ఎరుక పిడికెడిధనము.

ఐశ్వర్యానికి అంతములేదు. ఒక అబద్ధము కప్పడానికి వెయ్యి అబద్ధములు కావలెను.

ఓరిస్తే ఓరుగల్లు పట్టణమవుతుంది. ఔషధానమ్ అనపథ్యానమ్ చెల్లు, రోగముపై పిచ్చు

—శ్రీమతి కోటదుర్గ సోమిదేవమ్మగారు.

# ప్రేమ, భక్తి, జ్ఞానప్రసన్న పారిజాత ప్రసూనములు

శ్రీయుత విం. అ. సూర్యనారాయణగారు

'Serene will be our days and bright
And happy will our nature be
When love is an unerring light'

(*Wordsworth*).

**Sweeter than anything sweet is the art of love; greater than anything great is the art of giving it (love) up.**

మానవజీవితములో ప్రేమసుధామాధుర్యమును గ్రోలుటకంటె నెక్కుడు ప్రీతికరమగు ఆనందానుభవము లేదు. అట్లనే భక్తి పులకితమగు తన్మయత్వము నొందుట కంటె నుత్తమమగు ఆంతరంగికానందము లేదు. ఆనందతరంగముల నోలలాడించు ప్రేమాతిరేకసుఖమును, ప్రేమపాశ సంబద్ధసంసారమును, బుద్ధునివలె పరిత్యజించుటకంటె ఘనమగు పరమార్థము పృథ్విలో లేదు.

ప్రేమపారవశ్యమే మానవత్వముయొక్క సంపూర్ణసౌందర్యప్రభావమని చెప్పదగును. గోపికలు శ్రీకృష్ణునెడ ప్రసరించిన ప్రేమమాధుర్యములో, స్త్రీ పురుషుల అన్యోన్యానురాగములో నిండి నిబిడీకృతమైన మానవదివ్యత్వస్వరూపములు పూర్తిగ ప్రత్యక్షమొనరింపబడినవి. భక్తిపారవశ్యముచే భగవంతుని సాక్షాత్కారము చేసికొనగల్గుటే కాక పరమాత్మని సేవలనుగూడ బడయగల్గిన సతీసక్కుబాయి సుచరిత్రములో స్త్రీ వ్యక్తిలో గల దివ్యత్వము తేజరిల్లెను.

భక్తియొక్క పరిపక్వదశయే జ్ఞానజ్యోతియొక్క దివ్యప్రకాశమై యున్నది. ప్రేమ, పవిత్రతను బొందినపుడు భక్తిగ మార్పుజెందును. భక్తియను బంగారము వైరాగ్యమను అగ్నిలో శుద్ధిజెంది జ్ఞానమను మేలిమియై ఘనతగాంచును.

ప్రేమ ప్రధానముగ నైంద్రికానుభవము. అహంకారముతో గూడిన ఆనందాన్వేషణము ప్రేమయొక్క సహజస్వభావము. భక్తి నిరహంకారభావముతో గూడిన ఆంతరంగికానుభవము. జ్ఞానము కేవలము ఆత్మానుభవము. ఆత్మజ్ఞానములో, సర్వభూతములతో నైక్యభావమేర్పడును. ప్రేమయొక్క సంపూర్ణత్వము భక్తియొక్క ప్రథమ సందర్శనము. ప్రేమ అను క్షీరములలో నుండి భక్తి అను మీగడ తయారగును.

స్త్రీ పురుషుల ప్రేమపవిత్రతకు శ్రీ సీతారాముల దాంపత్యమునకు మించిన దృష్టాంతములేదు. ప్రేమయొక్క పరిపూర్ణత్వమునకును భక్తియొక్క పారవశ్యమునకును శ్రీ రాధామాధవుల దివ్యలీలలను మించిన మంచి నిదర్శనములేదు. భక్తియొక్క ప్రభావమునకు, జ్ఞానముయొక్క ఘనతకు, ప్రభంజనపుత్రుడును, ప్రహ్లాదకుమారుడును ప్రశస్త ప్రత్యక్ష ప్రమాణములుగ పురాణములు బోధించుచున్నవి.

మహాపురాణములలో మహినుతికెక్కిన మూడింటిలోను మహాభారతము శిక్షణ గ్రంథము. అందుచేతనే అది బాల్యములో చదువదగిన సద్గ్రంథమని పెద్దలు చెప్పుదురు. ఇందు ప్రపంచ ధర్మములన్నియు ఇతిహాసరూపమున వెల్లడింపబడినవి.

శ్రీమద్రామాయణము అనుభవగ్రంథమగుటచే యౌవనదశలో పఠింపదగినది. శ్రీ సీతారాముల ఆదర్శ దాంపత్య ధర్మములను బాగుగ మననముచేసికొని స్త్రీ పురుషులెల్లరును ఆ పురాణదంపతుల పవిత్రజీవితముల ననుసరింప పాటుపడుటకంటె మానవజీవితములో మహితధర్మము లేదు.

శ్రీమద్భాగవతము భక్తిజ్ఞానవైరాగ్య ప్రబోధకమైన ఆధ్యాత్మిక గ్రంథము. ఈ యుత్తమపురాణము కేవలము భక్తిసుధాస్వాదన మత్తచిత్తులగు సుజనులకు కలకండవలె తియ్యనై కంఠమునంటియుండు మాధుర్యముతో నిండియుండును.

శ్రీ మహాభారతము షడ్రసోపేతమైన విందుభోజనమువంటిది. శ్రీ మద్రామాయణము, ప్రశస్తమైన గోధుమపిండిని తీయని గోక్షీరములతో కలిపి, కమ్మని ఘృతమునందు చేర్చి, మధురమగు ఖండశర్కరతో మిళితము చేసి, అందు మనోహరమగు భావములను ద్రాక్షపండ్లను, కమనీయమగు భాషాపరిమళద్రవ్యములను మిశ్రితమొనర్చి,చక్కగ తయారు చేసిన పిండివంటకము (శ్రీ సీతారామాంజనేయ ప్రసాదము)మాదిరి నుండును. ఈ భక్ష్య పదార్థమును భుజించిన భక్తులకు మోక్షమును ఐహికసుఖమును తప్పక సిద్ధించును.

ప్రేమానుభవమునందు, తనవారు, పెరవారు, అను భేదభావములకు తావున్నది. ప్రేమ స్వాభిమానముతో గూడిన సౌహార్ద్రరసమును ప్రవహింపజేయును. భక్తి ప్రతి జీవియందును భగవత్స్వరూప ప్రతిబింబమునే పొడగాంచుచుండును. ఆత్మానందము నందరిలో నన్వేషించుచుండును. జ్ఞానము అఖిలజీవులలో ఆత్మస్వరూపమునే అవలోకించుచుండును.

"ఆత్మవత్సర్వభూతాని యఃపశ్యతిసపండితః" అనునట్లు విశ్వప్రేమమహిమను వెల్లడింపగల జ్ఞానమే నిజమైన బుద్ధిపరిపక్వప్రాభవము. ప్రేమ భాసురమగు మధురభావముల

నుండి భక్తిపుష్పము వికసించి, బుద్ధిపరిమళమును ప్రసరింపజేసి, త్రికరణశుద్ధితో గూడిన చిత్తశాంతిని సందీపింపజేసి, ఆత్మజ్ఞానానందమును అన్ని యెడలను చిందుచుండును.

'Love is the highest moral law' అని ఆంగ్లకవి కోకిలమగు షెల్లీ (Shelley) సుజ్ఞాని చెప్పినటుల ప్రేమకుమించిన నైతికధర్మ మిలలోలేదు. భక్తికిమించిన పరమధర్మము లేదు. దయకుమించిన దివ్యగుణములేదు. సత్యమునకుమించిన జ్ఞానసంపదలేదు. ఆత్మజ్ఞానమునకంటె అధికైశ్వర్యము అవనిలో నుండబోదు. తన్నుదా దెలిసిన సర్వము నెరుంగ గలుగును. ప్రేమ కాంతిపుంజమునుండి భక్తి ప్రకాశమును, భక్తి ప్రకాశిత బుద్ధివైభవము నుండి దివ్యజ్ఞాన తేజస్సును సంభవమగుచున్నవి.

ప్రేమతత్త్వమును పరిపూర్ణముగ ననుభవముచే నవగాహనమొనరించికొని, ప్రేమ ప్రభావమును ప్రపంచమునకు చాటిన ప్రఖ్యాత పాశ్చాత్య కవిశ్రేష్ఠుడగు బ్రౌనింగు మహాశయుడు ప్రేమయే జ్ఞానమునకు ప్రధానహేతువని చెప్పియున్నాడు.

" So let us say, not since we know we love.
But rather since we love, we know enough "

పై వాక్యములో బ్రౌనింగుకవి మానవప్రేమకు జ్ఞానముకారణము కాదనియు జ్ఞానమునకుమాత్రము ప్రేమకారణమనియు ప్రస్ఫుటమొనరించియున్నాడు. ఈ వాక్యము లోని భావము నాధారముజేసికొని ఒకపెద్దవ్యాఖ్యాన గ్రంథమును వ్రాయవచ్చును.

ప్రేమ, హృదయపారిశుద్ధ్యమును, భక్తి అంతరంగికపవిత్రతను, జ్ఞానము చిత్తసంశుద్ధిని, చిత్తశుద్ధి, పూర్ణప్రజ్ఞను గలుగజేయుచున్నవి. 'Self - reverence, self - knowledge, self - control, these (three) lead life to sovereign power' అని ఆంగ్లకవి పుంగవుడగు టెన్నిజన్ (Tennyson) మహాశయుడు చెప్పియున్నాడు. ఆత్మగౌరవము, ఆత్మజ్ఞానము, ఆత్మనిగ్రహము, ఈ త్రిగుణసాధనము, త్రైలోక్యాధిపత్యమును, అతులిత శక్తివైభవమును, శాశ్వతానంద సామ్రాజ్య సార్వభౌమపదమును ప్రసాదింపగలవనుట అతిశయోక్తికానేరదు.

ప్రేమ ప్రతిఫలము నపేక్షించును. ప్రేమించిన పదార్థమును హృదయములోనిడు కొని, ఆనందముననుభవింప నభిలషించును. ప్రేమపరవశుడు స్వార్థపరత్వముతోగూడిన భావములను ప్రేమయొక్క సంపూర్ణ సాఫల్యమునకై ఆవేశమను అగ్నిలో ఆహుతిసేసి తత్త్యాగయజ్ఞఫలితమగు శాంతానందప్రసాదమును భుజింప నాకాంక్షించును.

భక్తి, భగవత్పాదారవిందసేవా సంజనిత దివ్యమకరందబిందు సందోహమును తప్ప నితరమును గోరదు. భక్తియొక్క మాహాత్మ్యమే జ్ఞానముయొక్క సహజతేజము. ప్రేమ

ఆశాప్రపూరిత ఆనందమును, భక్తి ఆశాపాశ పరిచ్ఛేదన ప్రసాదితమగు భగవదనుగ్రహమును, జ్ఞానము సర్వసంగపరిత్యాగ సహితమగు తాదాత్మ్యము (ఆత్మతో నైక్యము నెందుట)ను అనుభవింపగోరును.

ప్రేమ స్వర్గమునుదాటి, భక్తి శాంతిసౌధాగ్రమునెక్కి, జ్ఞాననిలయములో వెలుగొందు నిశ్చలతత్వపదవిని స్వాధీనము జేసికొనిన పిదప మోక్షసామ్రాజ్య సింహాసనము నధిష్ఠింపగల భాగ్యమెుదవును. శ్రీ బుద్ధదేవుడు సిద్ధిజేసికొనిన నిర్వాణమే ఆత్మజ్ఞానానందానుభవముయొక్క అంత్యావస్థ.

విశ్వప్రేమమయుడై విలసిల్లి, భక్తిరసప్రపూర్ణుడై భాసిల్లి, జ్ఞానతేజోనిధియై మానవజన్మఘనత నుద్దీపింపజేసి, వైరాగ్యప్రజ్ఞా వైభవోపేతుడై వేదాంతసత్యస్వరూపమును వెలయించి, ప్రపంచమతసామరస్యమును నిత్యజీవితానుభవములచే ప్రత్యక్ష మొనరించి, అవతారపురుషుడై భువినుద్భవించి, భారతమాత దివ్యమతమాహాత్మ్యమును ప్రపంచమునకు వెల్లడించి, భారతీయులెల్లరిచే భగవత్స్వరూపముగ భావింపబడి పూజింపబడు చున్న శ్రీ రామకృష్ణపరమహంసదేవుని దివ్యసుందరమూర్తి నొకపరి ధ్యానించుచో ప్రేమ, భక్తి, జ్ఞానప్రసన్న పారిజాత ప్రసూనములు భావప్రపంచములో ననంతములై ప్రకాశించును.

శ్రీమద్భాగవతములో, బమ్మెరపోతరాజు, ప్రహ్లాదచరిత్రలో పొంగిపొరలజేసిన భక్తిజ్ఞానవైరాగ్య ప్రవాహతరంగములలో, శ్రీ సచ్చిదానందబ్రహ్మస్వరూప సాక్షాత్కారమునకు సాధనమైన పరమార్థము నీ దిగువ నుదాహరింపబడిన పద్యములో ప్రపంచమునకు బయల్పరచినాడు. ఈ పద్యమందలి దివ్యసత్యము నెదలో దలంచి, తన్మయత్వమును జెందుటయే జీవిత పరమార్థము. దివ్యజ్ఞాన సారస్వతసారమగు నీ పద్యరత్నమును ప్రేమారథకులును, భక్తిమార్గానుచరణాసక్తులును, జ్ఞానతత్వవిచార నిమగ్నులును బాగుగ పరిశీలించిన సర్వార్థసిద్ధికరమగు సత్యము తేటపడగలదు.

సీ. 'నీ గృహాంగణభూమి నిటలంబుమోవంగ, మోదించి నిత్యంబు మ్రొక్కఁడేని
నీ మంగళ స్తవనికరవర్ణంబులు పలుమారు నాలుకఁ బలుకఁడేని
నీయధీనములుగా నిఖిలకృత్యంబులుఁ, బ్రియభావమున సమర్పింపఁడేని
నీపదాంబుజముల నిర్మలహృదయుఁడై, చింతించి మక్కువఁ జిక్కఁడేని
నిన్నుఁ జెవులార వినఁడేని నీకు సేవ, సేయరాఁడేని బ్రహ్మంబుఁ జెందఁగలఁడె
యోగియైనఁ దపోవ్రతయోగియైన, వేదియైన మహాతత్త్వ వేదియైన'

# లలిత శపథం

శ్రీమతి దుగ్గిరాల వెంకటసుబ్బమ్మగారు

రాజ్యంవద్దనుంచి సమాధానంకోసం ఉవ్విళ్లూరుతూంది లలితం. నిజంగా రాజ్యమంటే చిన్నతనంనుంచి లక్ష్యమున్నూ, నమ్మకమున్నూ, ఉండేది. ఆటపాటల్లోకూడా మంచి "జోస్తీగా" వుండేవాళ్లు. ఒకటే మనస్సు. ఒకటేమాట. అట్లాజరిగింది చాలాకాలం. ఐనా ఆడపిల్లలకు యెంతకాలం జరుగుతుంది పుట్టింట. వయస్సున రెండుసంవత్సరాలు పెద్ద లలితకన్నా రాజ్యం. అవారముండే కాపురానికి వెళ్లింది. ఇంటిదగ్గిర యిల్లు కావడంచేత యెంతోచమత్కారంగా వుండేవాళ్లు యిద్దరున్నూ. రాజ్యంచెప్పేమాటలకు యెంతోవిలువ చూపించేది. వాళ్ల జీవితాల్లో "యెడమొహం," "పెడమొహం," గల ఘట్టాలు యెప్పుడూ జరగలా. అందుకనే వాళ్ల స్నేహలత పత్రజలంచేత శుష్కించకుండా మనోవృక్షాల్లో అల్లిబిల్లిగానల్లుకుంది.

లలిత ప్లీడరుగారిపిల్ల 1. ఇప్పటికి 18 యేండ్లుంటాయి. కాపురానికి వచ్చినప్పటినుంచి సతీపతులకు శృతికలవలా. "గాల"ని "ధూళ"ని యెన్నోవైద్యాలు చేయించారు. విసుగెట్టింది. అంటే తొలుచూరి బిడ్డ పడంచేత, ప్లీడరుగారు యెత్తెత్తుబంగారంగా పెంచి ఇష్టంవచ్చినట్లు స్వాతంత్ర్యమిచ్చాడు చిన్నతనంలో. ఆ రోజుల్లో అలవడ్డ నాగరికతా బీజాలు నేడు సతీపతులమధ్య విషబీజాలుగా మారినై.

లలిత భర్తపేరు సుందరం. సుందారానికి తల్లివగైరా అంతావున్నారు. తండ్రి చిన్నతనంలోపోయాడు. కాని గంపంతబలగంవుంది. పూర్వీకులు సంపాదించిన అగ్రహారాలవల్ల జీవనాధారం.

నాలుగుమూడు భాషల్లో వ్రాయను, చదువను, తెలుసును. కాని స్వభావసిద్ధమైన అలంకారాదులకే వాని హృదయపీఠంలో చోటుంది. ఆకారణంచేతనే, లలిత వేషభాషలంటే అసహ్యం అనిపించింది. తన మార్గాన్ని నిరోధించడంచేత లలితకున్నూ అంతే. మొదట్లో లలితపట్ల అనేకవిధాల అనుకున్నా, తర్వాత గ్రహించుకున్నారు పెడమూర్ఖతనమని గృహంలోనివారు.

ఒకరోజు విచారంతో ఆలోచించడం ప్రారంభించింది లలిత. యేమేమో ఉద్దేశాలు తట్టినై. యీ విషయమంతా రాజ్యానికి తెలియజేసి తదభిప్రాయంగా వెళుదామని నిశ్చయించుకుంది.......అప్పటికి వారం రోజులైంది ఉత్తరంవ్రాసి. సమాధానంరాలా. ఆదుర్దాపడింది. క్రిందటిరోజున తపాలాలోవచ్చిన వుత్తరాన్ని తీరెల్లాచదివి మళ్లాడ్రాయిరుమీద పెట్టేడు చెక్కుచెదరకుండా సుందరం. యేదోవిచారంతో గదిలోకెళ్లి తిరగడంలోకమ్మకంటబడింది లలితకు. బ్రహ్మానంద పడ్డది. గది తలుపులు గట్టిగాబిగించి మనస్సున చదవడం మొదలెట్టింది.

ప్రియమైన సోదరీ!...

నీవువ్రాసి పుత్తెంచిన వుత్తరమందినది. సంగతులు తెలుసుకొంటిని. శుష్కించిన చిన్ననాటి స్నేహపాదపమునకు, పత్రగంగోదక మిచ్చి మరింత పుష్టినిచ్చు నీలేఖిని ప్రశంసాపాత్రము. కమ్మ చదువునంతసేపును నీవు

సమీపముననున్నట్లే భావించితిని. మనము గొబ్బిళ్ల పండువరోజులలో తోటిబాలికలకన్న ముందులేచి ప్రాతఃకాలమున "గుమ్మడిపూలకును, ఆవుపేడకును," పాతరలాడు నాటిదినములు నా మనోవీధి నొక్కసారి గోచరించెను. తల్లిదండ్రుల ప్రేమచే మృదుహస్తములలో మెలగు స్వాతంత్ర్యపు-బాలికలుగానున్న దినములు కదా మిక్కిలి పవిత్రములైనవి. సాంసారిక సుఖదుఃఖములకులోనుగాక అపరపరబ్రహ్మమూర్తులో యనభాసిల్లు శిశువులజీవితము ధన్యము చెల్లీ!

మీ సతీపతుల మధ్యనున్న యీ కలహనాటకము విషాదాంతముగా మారకుండునట్లు జాగరూకతతో వర్తింపుము. భవసాగరమున భార్యాభర్తలిరువురు ప్రయాణీకులు. జీవితములే నౌకలు. ధర్మార్థకామమోక్షములు తీరములు. ప్రయాణమున ననుభవించు కష్టసుఖములకు నిరువురునూ సమానభాగస్వాములే యగుదురు. అనుక్షణమును వివాదలకు తావిచ్చినచో గమ్యస్థానమును చేరక విఫలమనోరథులగుదురు. ఇంతకు పాశ్చాత్య వ్యామోహములచే సంక్రమించిన ఆచారములు మనల బద్ధులచేసినవి. నేటి నాగరిక భామినులనేకాక పూర్వాచారముల ననుష్ఠించు శ్రోత్రియకుటుంబ వృక్షములకు సహితము యీ చీడపురుగు తప్పినదికాదు. కాని యేది యెట్లున్నను భర్తనుల్లఘించి వారి మనస్సు నసంతృప్తిపడునట్లు పెంకెపట్టుదలతో పెనగులాడు నీ సాహసము పరిహాసమునకు నావాసము. చేతులార చేసుకొను నీయకృత్యమును దైవికమనియు, కర్మయనియు, వాకొందువు. అది పట్టి తెలివితక్కువయని చెప్పుదును. నాపై విసుగుకొనక ప్రశాంతముగా నాలోచించిన నీకే బోధయగును. అదిగాక భర్తకసహ్యముగాతోచు ననాగరికత లెవరికి? పతియేగతియని కదా, చంద్రమతి, దమయంతి, సావిత్రిమొదలగు సతీమతల్లులు తమతమ భర్తలతో అష్టకష్టములకులోనై సర్వసౌఖ్యములకు దూరులైరి. వారివలె కాంతారములకు నేగకయే ఇంటనుండి మహామహిమను సంపాదింపకల్గుదువే! అడకువతో పతిమాటలనేల యంగీకరింపవు? నీ నాథుడు చెప్పునట్లునడచిన నీకుగల్గుకష్టమేమి? వారు పూర్వాచార పరాయణులు. బూటకపు నాజూకన్న సుతలాంవారికి నచ్చదు. చూడగా మీ దాంపత్యము "కళాపూర్ణోదయములోని శాలీన సుగాత్రులకథ" జ్ఞాపకము తెచ్చుచున్నది.

బుజాలవఱకును తమ్మకాయలవలె వ్రేళ్లాడు ఆ "లోలాకుల" తీసినమాత్రమున లోపమేమి? మంగళప్రదమై వివాహవేళ అగ్నియెదుట ప్రమాణపూర్వకముగా మెడనుకట్టిన నల్లపూసలు మోటుగానుండినవని మెడనుండి తీయుటకు నెట్లు సాహసించితివి? "భూషణములు పుట్టినప్పుడు లేవుకదా. పెరిగినప్పుడేల" యని ప్రశ్నింతువు. యెంత వేదాంతము కలిగినది? నీవు ధరించెడి చీరె పుట్టినప్పుడే మెులకు చుట్టబడివుండెనా? భారసాలరోజుననే జుట్టుముడికి పిన్నీసులచే బంధనమేర్పడెనా? లలితా! మెట్టెలు, పాదాభరణములు, ముక్కుపుడకలు, నొష్టకుంకుమ సహితము విసర్జించిన నీకొదవు లాభమేమి? అమంగళసూచకమే కాని నాజూకు కానేరదే! యెన్నడునూ పతివ్రతయైన కాంత వీటిని యేమరక రక్షించుచుండును. ఒకరేది ప్రారంభింతురో దానిని విమర్శింపకే వారి మతమును సులువుగా గొఱ్ఱె దాటుడువలె అనుకరింతుము. అది మనలోనున్న గొప్ప పొరపాటు. యేవి మనమనుష్ఠించిన ప్రమాదములు కానేరవో, యేవి సంఘమును, మానవ జీవితాశయములను భగ్నమొనర్ప యత్నింపవో, అవి పరిశీలనారూపమున ననుష్ఠించుట శ్రేయోదాయకము. భర్తకు శుభముగోరు యే పడతి, నాథుని సంపూర్ణారోగ్యమునుగోరు యే సత్సతి, పతి జీవించియుండగనే, వారి సాక్షాత్కారమున కంఠమున తాళివినాగా శరీరమునందుగల సర్వాభరణాదులదీసి, దీపపు శెమ్మెవలె

మోడుగా నుండుటకు నిశ్చయించును? పాశ్చాత్య నారీమణుల నాగరికతా వ్యామోహముచే సమ్మోహితులమై, నెంతయో పూర్వజ్ఞానశూన్యులమై, ప్రతిభ దఱిగియుంటిమి. చెల్లీ! మోచేతులవఱకును నీపతి చెప్పునట్లు రవికల కుట్టించుకొనకూడదా. నీకా చంకలవఱకనే పంతమెందుకు? నీకొఱకు నిత్యము తెచ్చు పూలను కొప్పునందు తుఱుముటకు నాజూకు కాదని ఆ నల్లటి వాడిదేరిన ఇనుపమొద్దు సూదుల గ్రుచ్చుకొనుట చూడ యెంతయో విషాదకరము. మొదట నిన్నా సినిమాలకు తీసుకొని త్రిప్పిన ఫలితము నాథుని కట్టికుడుపుచున్నది. మన పూర్వీకులు ఆరోగ్యపద్ధతులతో జతపఱచి కొన్ని సదాచారముల నెలకొల్పిరి. వాటిని నిస్సారముగా నీనాడు చూచి తత్ఫలితముల ననుభవింపుచుంటిమి. మోమును మిసమిసలాడు పసుపుచే తోముకొనుటకన్నను తెల్లటి విభూదివోలెనుండు దాని నద్దుటచే వచ్చిన అందమునకు విలువ నిర్ణయింపరానిదికదా! నా లలితా! నీవే తగిన శిక్షణను నేర్వనప్పుడు నీ సంతానమును నెట్లు తీర్చి దిద్దకలవు. సాంసారిక తాపత్రయములలో బడి దివారాత్రములు తిరుగాడు నీ పతి జీవితమున "శాంతి" యనునదెక్కడిది? నాథుని సంతృప్తిపఱచలేని నీవు గృహమున గల నాప్తుల తలలోని నాల్కవలె మెలగనేర్తువా? నీ ప్రవర్తన మెచ్చదగనిది. ఇదిమొదలు నామాట నంగీకరించిననే నీ కష్టసుఖములను దెల్పుము. తేమన్న......మగవారలు స్వాతంత్ర్యజీవులు. మన కెన్నటికిని స్వతంత్రతలేదు. స్వతంత్రముగా మనమున్న ఒకరందురని కాదు. అది మానవతులకు తగనిపని. మనము గృహలక్ష్ములుకాని, పురలక్ష్ములము కాముకదా. సమాన ప్రతిపత్తిని కలిగింపజేయలేదని పురుషులపై నిందమోపు టసభ్యము. మనలోపమును సవరించుకొనికదా యితరుల విమర్శించుట. మరొకప్పుడు యీ విషయమై నీయెదుట తెల్పెద. ఆ మూలాగ్రముగా విసుగుచెందక చదువుము. నీకు సంపూర్ణముగా నచ్చిననే నా భావముతో నేకీభవింపుము. నా తోచినమాటలివి. ఇంతయును స్నేహముచే వ్రాయవలసివచ్చెను. మీబాబు బజారునుంచి వచ్చే సమయమయింది......సెలవు."

స్వర్ణపురి,
9—11—1939.

నీ సోదరి,
రాజ్యం.

కొస్త కొస్త చొప్పున ఉత్తరమంతా పూర్తిగా చదువుకుంది. చేతులు వణుకుతున్నై. త్రాగిన కాఫీ నీళ్లన్నీ కళ్లల్లోంచి కారుస్తున్నది. లోకమంతా అంధకారంగా తోచింది. అవ్యక్తానికి చింతించుకుంది. పతిని లక్ష్యపెట్టక అశాశ్వతమైన యీ శరీర సౌందర్యమునకు యెంతటి ఘోరమైన కలతను, కళంకరహితమైన యీ కాపురానికి కల్పించితినని వగచింది. అన్నపానాదులకు నలజడిలేక—పూర్ణారోగ్యము కలిగి చదువుకున్న పతి లభ్యమైనను అనుభవించు యోగ్యత నోచుకొనని నా జీవితమెంత నికృష్టమైందని అనుకున్నది. నిలువుటద్దములో ప్రతిఫలించిన తనరూపు చూచుటకు పెద్ద తప్పుగా తోచింది. స్వరూపములో "వితంతువులకునూ, తనకునూ భేదమేచట" యని వితర్కించి నిట్టూర్పువిడిచింది. తనకెదురుగా వాకిలిపై వ్రేళ్లాడుతున్న భర్త పటాన్ని చేతబట్టుకుని వక్షస్థలానికి గట్టిగా నద్దుకుంటూ, మనస్సులో యేదో సంకల్పించి నిశ్చలచిత్తంతోటి ప్రమాణంచేసుకొంది లలిత...



## — జీవయాత్రకుఁ దగిన నెచ్చెలివి నీవ —

చ. నెలకొకసారి మాదరిని నిండుకళల్ వికసింపఁజేసి, స
ల్లలితములైన వాక్యములఁదన్పుచుఁ గన్పడుచుందువీవు నీ
వలన సతీత్వ తత్త్వగుణవైఖరి యిట్టిదటన్నమాట నె
చ్చెలులనుగూడి సంస్మరణఁ జేసికొనందగు భాగ్యమబ్బెడిన్.

సీ. ప్రతినెలకొకసారి రానుంటివన్నచో నాత్మలో నుల్లాసమంకురించు
వచ్చినయంతనే నెచ్చెలులంగూడి మించువేడుక నిన్నాగిలించుకొనుచు
మనలఁ బోషించెడు మాతయే యిదియంచు నీ గుణమింత వర్ణించుకొనుచు
తిరిగి నీవిటకేగు దెంచెడుదాకనీ చెయ్యువేలే నిత్యంబుఁ జెప్పికొనుచు

గీ. నింటపనులైనమాని నిన్నింత మెచ్చి
కొనుచు విమలవిజ్ఞాన సద్గుణములెల్లఁ
బట్టుబడునంచు నిన్నెప్డు వదలకుండఁ
దలఁచుచుందునో గృహలక్ష్మి తల్లికాన!

సీ నీవల్లనేగదా నిజధర్మంబులు నిరతంబు భక్తిగానేర్చుచుంట
నీవల్లనేగదా నీకైన స్త్రీధర్మ మత్యంతశ్రద్ధతో నరయుచుంట
నీవల్లనేగదా నీతిబోధకమగు వ్యాసాళిఁ బఠియించుభాగ్యముంట
నీవల్లనేగదా నిశ్చలతత్త్వంబు సాధింపఁగాఁజాలుశక్తిఁగనుట

గీ. ఇట్టినీతికి భూతికి నెల్లయెడల
నాలవాలమై వికసించి యలరుచున్న
నీకు గృహలక్ష్మి పత్రికా! నిత్యశుభము
కల్గుఁగావుత లోకవిఖ్యాతి మీఱ.

గీ. వసుధనెచ్చెలు లెందఱోవచ్చి పోవు
చుందురేకాని నీవలె నొక్కరైన
జ్ఞానబీజంబు నాలోననాటినారె?
జీవయాత్రకుఁ దగిన నెచ్చెలివి నీవ.

—శ్రీ వాజపేయయాజుల మహాలక్ష్మి.



శ్రీయుత కేసరిగారు స్వర్ణకంకణములను బహూకరించుట

## గృహలక్ష్మి జయంతి మహోత్సవము



కవితిలక శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారిచే స్వర్ణకంకణగ్రహీతలకు బిరుదప్రదానము




## కవితాకళ

శ్రీయుత గోనెల నరసింగరావుగారు ఎం. ఏ. బి. యల్.

కవితాకళలోనిఘనతను కనులకు గట్టురీతి నొప్పుచు కమనీయమగు భావములతో మనోహరమగు నుపమానములతో వచనరచనా కౌశలముతో నీవ్యాసరాజము విలసిల్లుచున్నది. (గృ|| సం||)

గృహలక్ష్మి "కళాకలాప"మున కేదే నొకకళకు సంబంధించిన వ్యాసమును వ్రాయుమని శ్రీసంపాదకులుకోరినారు. నాకు కవితాకళారాధన ప్రియమైనట్లన్యములుకావు. కాక, "కళాకలాప" మను పేరులోనే కవితాకళ తళుక్కుమనుచున్నది.

లలితకళలలో నగ్రతాంబూలము నకర్హమైనది కవితాకళయేనను లోకమ్మోఁదన మున్నది. ఏకళనుపాసించు వారాకళయే నన్నిట నుత్తమమైన దనుకొనుట నైసర్గికము. శిల్పులు శిల్పకళను, చిత్రలేఖకులు చిత్రకళను గాయకులు సంగీతకళను, నటకులు నాట్యకళను, కవికుమారులు కవితాకళను నలౌకికప్రేమతో పూజింతురు. కావున భక్త్యాదరములను బురస్కరించుకొని యేశాఖకుఁజెందిన వారాశాఖకే ప్రధానస్థానమిచ్చుచుందురు. ఇది సర్వసాధారణముగఁ నందఱకుఁ దెలిసినవిషయమే. కాని న్యాయసమ్మతముగఁ మాట్లాడవలసివచ్చినపుడు మాత్రము, సాహిత్యకళదే తొలిపలుకు.

'కవితాకళ' యన నొక్క కావ్యములకు సంబంధించిన కళావిశేషమే యనుకొనరాదు. అనఁగా నొక్క పద్యరచనములోనే మెఱసిపోవుచున్నదనుట కుంఠితభావము. జాళువాకైఁతలో, నమృతవాక్కులో, దేనెలొల్కుమాటలో, జిలిబిలిపాటలో, కవితాకళ చెమర్చిపోవుచున్నది. తుదకు పాపని 'అత్తలో', బాలుని 'అమ్మలో', మారాముమాటలో, గారాబుపాటలో, పిల్లల 'ఓనామఃలో', 'కా' గుణింతములో, చెల్లాయి 'చెమ్మచెక్కలో' బాబాయి దసరా పదాలలో, నమ్మాయి సరిగమలలో, 'పిల్లారి' గీతములలో, నబ్బాయి 'కాకి' కథలో, నీతిపద్యములలో, కన్యక 'త్యాగరాజ' కృతులలో, యువకుని 'జాతీయ' గీతాలలో కవితాకళ పుక్కిలింతలై పోవుచున్నది. యువతీయువకుల యమాయకపు మాటలందు, ప్రేయసీప్రియుల మకరందవచనములందు, స్త్రీపురుషుల ప్రౌఢసంభాషణలందు, కవితాకళ తులికిపోవుచున్నది. ఆనందములో పొటమరించి, ప్రణయములో పులక

రించి, సంసారములో కౌగిలించి, జ్ఞానములో 'ఉనికి, నిద్రించి, లేచి', పోవుచున్నది కవితాకళ. చిక్కనపొట్టకు పీయూషమిచ్చి, ముదురుగుండెకు నవనీతమిచ్చి, సోలినకన్నులకు నవ్వువెన్నెలలిచ్చి యాదరించుచున్నది కవితాకళ.

ఇంతయేల, కవికి కవితాకళ ప్రకృతిలో మొగముఁజూపును. కవి, కళాదృష్టితో ప్రకృతిదెసఁ గన్నులుగదలించును. కవితాకళ ప్రసన్నవదనముతో, తీయనిహృదయముతో మందహాసచంద్రికలతో స్వాగతమొసంగుచుండును. కవికళామయప్రకృతిలో లీనమై పోవును. మేఘశకలాలలో నేడువన్నెలుజూచి, మందపవనములో మురళీరవమునాని, స్వాతిజల్లులలో ముత్యాలుదోచి, పున్నఁపువెన్నెలలో మంచుమసుఁగులుఁద్రోసి, కఱకు 'కోహినూరు'లో కరుణారసముఁగ్రోలి, కెంపెక్కనకన్నులలో ప్రేమరహస్యాలునాటి, విరుల వలపులలో తేలి, గిరులశిఖరాలనేలి, తీవెపరదాలఁదాఁగి, కేకిసుందరి చెంత కేఁగి, మించు చాన పొంతనాగి, మురిసిపోయి, తొణికిపోయి కవితాకళ కవిహృదయములో కరఁగి పోవుచున్నది. "మంచునవ్వు"లతో నంబరమునకుమొలచు "చందమామబుడుత"ను "కుముదముతేనెతో నెదురుకొని" కావించుపూజకునిక్కి, "కన్నెగాడ్పు"ల విన్నాణపుఁ బన్నాగములకుఁజొక్కి, "పుష్పితనికుంజవిలాసి"నికి దక్కి, యానందకంధిని మునిఁగి తేఁలిపోవుచున్నది. "గర్భిణీమేఘము"లలో "పిల్ల నెలగాని"లో "గాడ్పుబిడ్డ"లలో "పూగుత్తిసొమ్ము"లలో, "చిగురాకులకోక"లలో కవితాకళనిండి యంచులు దాఁటి పోవుచున్నది. సాంధ్యచిత్రకారుని వర్ణచయములో వెలసిపోయి, గండుకోయిల మరంద స్వాదుగీతాలలో మెలసిపోయి, పూఁదేనె కాలువలలోకలసిపోయి, సాఁగిపోవుచున్నది.

కళామయప్రకృతినిఁ జూచిఁజూచి కవిపొంగి నింగినందుకొనును. ఆచిదానందములో తన్మయత్వముఁజెంది యావేశముతోఁ గలమునందుకొని, దివ్యభావములను జిత్రించి, చిక్కని సుధామధురవాక్కులతో గులికించి, యన్నిరంగుల రత్నాలంకారములతో శృంగారించి, హృదయముతోఁబల్కరించి కవితాకన్యను విశాలప్రపంచమునకుఁ గానుకనిచ్చును. "విశ్వమోహన కవితామధూళిమవియన్నదు"లలో, కళాభిజ్ఞులను ముంచితేల్చును.

ఇంతటి మాహాత్మ్యము, ప్రజ్ఞాధురంధరత్వము, అజరామరత్వముఁ గవి కెట్లబ్బెను? కవితాకళ నారాధించుటచేతనే; కవితాకళలో దివ్యశక్తియుండుటచేతనే; కవితాకళ సజీవమైనదగుటచేతనే; కవి పండిపోయిన యశస్సు; పండిపోయిన రేయెండ; పండిపోయిన నవ్వుద్రొంతర. కవితాకళకు రూపము కవి; కవికి జీవము కవితాకళ. "కలమునఁ గీర్తిశేషులకుఁ గాయములీయ సమర్థులైన బ్రహ్మలు కవిరాజు"లని మిత్రులు జాషువకవిగారు లోకమునకుఁ జాటినారు. (పైని కామాలలోనున్న మాటలన్నియు వీరి ప్రయోగములే.

ఈ కవీంద్రసోదరుని కలముచిందు మరంద బిందువులను నాళ క్తికొలంది వేటూకవ్యాసములో చవిచూపించెదను) కవితాకళ, ఇట్టి "బ్రహ్మ"లకుఁబుట్టినిల్లు కావుననే లలితకళలలో కవితాకళ లెన్నయునుచున్నాను. "కలానాం ప్రవరం చిత్ర''మని కొందఱి యభిప్రాయము. కాని "కలానాం ప్రవరం, కావ్య"మని మార్చుకున్న నందచందముగా నుండును.

ఇంత విపులముగ వ్రాయుటలో నాయుద్దేశ్యమేమనఁగా, కవితాకళ, పద్యకావ్యము లోనే గాక, వచనకావ్యములోను, వాడుభాషలోను, నాడుమాటలోను, పాడుపాట లోను, దనగళమును సవరించుకొనుచున్నదని నిరూపించుటకే. ఉదాహరణకొకటి రెండు పరిశీలింతము. "వేదాంతసత్యము, శాశ్వతమై, అగోచరమై, అఖండమై, అద్వితీయమై, అనంతమై, అచ్యుతమై, అనిర్వచనీయమై, అనుభవైకవేద్యమై, సర్వశాస్త్రప్రజ్ఞానాతీతమై, స్వచ్ఛమై, నిత్యమై, నిర్మలమై, నిరామయమై, శోభిల్లుచున్న జ్ఞానజ్యోతి" (శ్రీ విం. అ. సూర్యనారాయణగారు). చూడుఁడు. పై వాక్యములో కవితాకళ యెట్లుచిందుచున్నదో కవి తన మధురభావములను హృదయముతో మొలాముచేసిచేసి, యున్నతుఁడై యుదారుఁడై, యుద్రేకపూరితుఁడై, విజృంభించి పాడుకొనుచుండును. అయ్యది పద్యముగనో గద్యముగనో పదముగనో, పాదముగనో, మాటగనో, పాటగనో కవినోట వెలువడు చుండును. అదియే కవితామృతము. అందులోనే కవితాకళ యమృతమ్ముగఁ గజ్జెఁగదలించు చుండును. దివ్యత్వమును కంఠమెత్తి జాటుకొనుచుండును. అమందానంద మొసంగు చుండును. కాఁబట్టి పై నుదహరించిన శ్రీ సూర్యనారాయణగారి వచనములో కవితాకళ జాళువారుచున్నదనుట కరతలామలకము. ఈ యువకవి మృదుకరసరసిజమెంత యమృత సంభరితమో మీరే యూహింపుఁడు.

కనుక కవితాకళను పోషించుటయన నొక్క పద్యకావ్యరచనమే యనుకొనుట దురభిప్రాయము. కవితాకళను సంపూర్ణముగ నవగాహన మొనరించుకొనుటకు ముఖ్యావ యవము 'చెవి'. శ్రవణానందముగ నున్నది హృదయమును గదలించును. భావోద్రేకమును గలిగించును. ఆత్మపారవశ్యము నొందించును. ఆ దివ్యశక్తియే కవితాకళ. అది యేరూప ముననైన నుండవచ్చును. కర్ణరసాయనముగ, కర్ణామృతముగ, కర్ణపేయముగనున్న చాలును. ఉదాహరణకు "సుబ్బలక్ష్మికిఁ బెనిమిటి సుజనహితుఁడు" "ఉభయభాషా ప్రవీణాంక ఊట్లవెంక" యన్న పద్యపాదములను జూడుఁడు. ఇవి ఛందోబద్ధకవితా నియమ ములతోనున్నని కావున కవిత్వమనిపించుకొనుచున్నవి. కాని వీనిలో మనమింతవఱకు చర్చించుకొని నిర్ణయించుకొన్న యాదర్శకవితాకళ హుళక్కి. ఇట్టి పద్యము లెన్ని చదువుకొన్నను హృదయసంచలన ముండదు. నూత్నభావములు రేకెత్తవు. ఆత్మానంద మసలేలేదు. ఇందు కవితాకళ నిర్వీర్యమై, నిర్విణ్ణమై, నిస్తేజమైపోయినది.

"పురుషునిలో జ్ఞానమభివృద్ధియైనప్పుడే అతనిలోనున్న దివ్యత్వము తేజరిల్లగలదు. ఆ దివ్యశక్తి బుద్ధిరూపమున ప్రకాశించును. బుద్ధి ప్రాభవమునకు ప్రేమప్రకాశము తోడైన పరిపూర్ణమానవత్వము ప్రత్యక్షమగును. పరిపూర్ణమానవత్వమే భగవంతునియొక్క సగుణ స్వరూప సౌందర్యము." (డిసెంబరు 'గృహలక్ష్మి' ప్రథమ సంపాదకీయవ్యాసములోని) పై వాక్యములను జదువుకొన్నప్పుడు హృదయము పండిపోవుచున్నది; ఆనందముతో నిండి పోవుచున్నది. ఇది కవితాకళ. మచ్చునకు మఱొక్కటి, "గడ్డిమొలచెన్ పులిచాఱల గద్దెమీఁద." (శ్రీ జాషువకవి) ఈ చిన్నమాటలోని ప్రసంగము మీ చెవికందించి, మీ హృదయమున కప్పగించి, మీ రానందించుటయే లెస్స యని భావించితిని. సామాన్యుఁడను నేను దీని విలువ చెప్ప నసమర్థుఁడను. చిలువరాయఁడు వేయినాలుక లుపయోగింపవలసి వచ్చునేమో. కలము యితర ప్రసంగములకు లాగుచున్నది. వ్యాసముకూడ పెద్దదయినది. కాఁబట్టి మఱి సెలవు.

# ఆ శీ స్సు

శా. శ్రీలంగూర్చు గజాస్యమందున లసత్సిందూర మింపొందఁగా
కేలన్ దివ్యము లాయుధంబులు తగన్ గ్రేవన్ మహాభక్తి జే
జేలెల్లన్ వినుతింప విఘ్నతతులన్ జెండాడి కాపాడు తం
డ్రీ! లంబోదర! బ్రోవుమయ్య 'గృహలక్ష్మి' పత్రికా పుత్రికన్.

మ. సిరితోఁబుట్టువుగాఁగ వాణి శుభములేకూర్ప నేవేళలన్
గిరిజాకన్యయు రక్షసేయ ఘనుఁడుర్ కీర్తిప్రదుండైన కే
సరి నిన్నెంచెడి కన్నతండ్రి పతితల్ సాధ్వీమణుల్ బాంధవుల్
కొరతల్గల్గునె యెందునేనియును నీకున్ సర్వశ్రేయోన్నతిన్
చిరసౌభాగ్యము లందుమమ్మ 'గృహలక్ష్మి' చెల్లి! కళ్యాణివై.

సీ. చిత్రాలఁ జిలికించు చెల్లి! కమలాబాయి రమ్యమౌ నవ్య చిత్రాలతోడ
కవిరాణి సీతాంబ కని తీర్చిదిద్దిన ఆణిముత్యాల పద్యాలతోడ
మాన్య! శ్రీ వరలక్ష్మమాంబ శారదలేఖ లింపునింపు కథల సొంపుతోడ
బాలికారత్నాల పాలిపెన్నిధివంచు సోదరీమణుల సంస్తుతులతోడ

గీ. వెలుగుచున్నావు వీథివీథులను పసుపు
కుంకుమనుదాల్చి సంతోష కుసుమములను
విరియజిమ్ముచు నిగనిగల్ మెరయ రాజ్య
లక్ష్మి 'గృహలక్ష్మి' దీర్ఘాయురస్తు నీకు.

—శ్రీ కవికుమార మునగపాటి విశ్వనాథశాస్త్రి.

# ఆశీస్సు

ఓరసభావక్రమ మధురోజ్జ్వలగేయ సుధాస్రవంతినీ!
ఓరమణీయ జీవన మయూఖవిలాసిత లోకమోహినీ!
ఓరుచిరాద్య ధర్మసుమహోద్యమ యత్నిత విశ్వబోధినీ!
ఓరసికాగ్రగణ్యత మహోదయినీ! గృహలక్ష్మిదేవినీ!

తెనుగుటెడందలందుతరి తీపుల పుప్పొడివాకనించి, కా
మినులకు బుద్ధివైభవసమీక్షిత ధర్మపథంబుజూపి, జీ
వన సుకుమారమాధురుల వారల మాతృమయస్వరూప శో
భనలకు వింతయందములు బాటిలగా రుచియింతువీవగా!

అలసటలేక నెల్లపు దయాచితమై ప్రవహించు వాహినీ
సలిలమవీవు; తెన్గుధర సర్వలతాతరుగుల్మసాంద్ర శో
భలదనరారు దివ్యవనవాటిక; పూజవరాంద్రులేమ; —లీ
జము సుమప్రపూర్ణలకు సారముసంగు ప్రఫుల్లవాంఛలన్.

విశ్వసౌందర్యమాధురీ విలసనమ్ము,
శాశ్వతౌన్నత్యప్రణయ విశాలహృదయ;
మమలినోత్సాహవర్తనాహ్లాదగరిమ
కలిగి భాసిల్లుమా! చిరకాల మిట్లు.

నీమధుస్మేరమే నిల్వనీడగాగ
నీవచస్సుధయే ధర్మనియతిగాగ
నాంధ్రమహిళాభ్యుదయమెల్ల నలరుగాక
దేవి! గృహలక్ష్మి! మను! చిరంజీవినివయి.

—శ్రీ సండూరి ఈశ్వరం.

# వివేకానందుని దృష్టిలో భవిష్యన్నారీ సమాజము

శ్రీ స్వామి పూర్ణానందగారు

(సోదరి నివేదిత)

కైవర్తకులోద్భవయును, ధనాఢ్యయును, అగు రాణీ రాసమణి దక్షిణేశ్వర మందిరమును నిర్మించెను; క్రీ. శ. ౧౮౫౩ లో శ్రీ రామకృష్ణుడు పూజారియై అట నివసింపదొడగెను.

ఈ ఘటనాద్వయము వివేకానందస్వామి మనస్సున మిక్కుటముగ బనిచేసినవి—వీటి ప్రభావ పరిచయమును సంపూర్ణముగ ఆయనకూడ గ్రహించియుండడు. ఆయన గురుదేవుని శిష్యమండలి ఏ * ధర్మాందోళనమున కంగీభూతమైయుండెనో, ఒకమాదిరిగ దానిమూలమున నున్నది. నిమ్నశ్రేణికిజెందిన ఒక రమణి లౌకికభావమున జెప్పబూనిన, దక్షిణేశ్వర మందిరములేకున్న రామకృష్ణుని అభ్యుదయమయ్యేడిదికాదు; శ్రీ రామకృష్ణుడులేకున్న వివేకానందుడుండెడువాడుకాడు; ఆయనలేకున్న పాశ్చాత్యదేశముల ధర్మప్రచారమయ్యేడిదికాదు. పందొమ్మిదవ శతాబ్ద మధ్యభాగమున కలకత్తాకు కొన్నిమైళ్లదూరమున, కాళీమందిర నిర్మాణముపైననే, ఈ ఘటనాపరంపరలు ఆధారపడియున్నవి. అదియు మరల ఒకానొక ధనాఢ్యయును నీచవంశోద్భవయును నగు రమణియొక్క భక్తియొక్క ఫలము.

మా ఆచార్యదేవుడు తా నంతర్గతుడైయున్న సంఘముయొక్క జీవనవ్రతము స్త్రీజాతి, నిమ్నశ్రేణుల ఔన్నత్య సాధనమేయని తలపోసెడువాడు. ఖేత్రీరాజుతో కొన్నిమాటల జెప్పగోరి ఆయన ఫోనోగ్రాపు ముందు అమెరికాలో నిలబడినప్పుడు, ఈ విషయము దానియంతట అదే ఆయన మనస్సున స్ఫురించెను. విదేశముల తన్నాయన మృత్యువునకు పూర్వముకంటె సమీపస్థుడనని ఎంచినప్పుడు, దగ్గర గురుభ్రాతలేకున్న, ఈ చింత ఆయన మనస్సు నావరించుకొనెడిది; సమీపముననున్న శిష్యునితో నుడువుచుండెడివాడు. **"స్త్రీజాతియొక్కయు, నిమ్నశ్రేణులయొక్కయు ఉన్నతినిసాధించుట-ఇదియే మా మూలమంత్రమని ఎన్నడును మరవకుము".**

కాని, ఈ వాక్యములు పక్షపాతమును ప్రదర్శించుటలేదు. సన్యాసి, జీవితమును కేవలము సాక్షిస్వరూపుడై వీక్షించుచుండును, అందేపక్షమును అవలంబింపడు. చాల సాంప్రదాయములు, ఆయన వాటిలో జేరిన అధినేతగా పరిగణింపబడగలడని ప్రస్తావమొనర్చినవి. వాటికాయన ఒగ్గుదల చూపలేదు. స్త్రీజాతి, నిమ్నశ్రేణి కేవలము విద్యను బడయనిమ్ము, - వారి భవిష్యత్తునుగుఱించిన ప్రశ్నలనన్నింటిని వారే మీమాంసించుకొందురు—ఆయన స్వాతంత్ర్యమనిన ఇదియేయని తలచెడువాడు. మఱియు, ఈ విషయమునే ఆజీవితము అందఱికిని జెప్ప యత్నించెడువాడు. తన అభిజ్ఞత ననుసరించి ఆయన ఈ విద్యాస్వరూపమును గ్రహించినది. ఇంతవరకు దాని అతిసామాన్యాంశమే నిరూపితమైనది. వ్యక్తిస్వాతంత్ర్యమనిన ఆయన కపరిమితమైన శ్రద్ధయుండినను, 'పునర్వివాహమున వ్రతభంగ'మొనర్చుట నాయన ఏవగించెడువాడు. ఆయన హృదయపూర్వకముగ నిర్లొంచి, నుడువుచుండెడివాడు. 'ఇంకేమైన సరే గానిమ్ము, ఇది కాకుండునుగాక'.

* ఈ వ్యాసమున 'ధర్మ' శబ్దము మతము, Religion లకు ప్రత్యుత వాడబడినది. —అను.

వైధవ్యసూచకమగు శ్వేతవసన మీాయనకడ సర్వవిధముల పవిత్రత, సత్యముల చిహ్నముగనుండెడిది. కనుక, ఈ విషయములపై లక్ష్యముంచని శిక్షాప్రణాలిని ఆయన స్వాభావికముగ విద్యయని పరిగణింపకుండెను. చపలమతి, విలాసిని, జాతీయతాభ్రష్ట అగు నారికి శతసంఖ్యాకముగ బాహ్య పరిపాట్యమున్నను, ఆయన దృష్టిలో విదుషి కాదు, పైపెచ్చు పతిత. పక్షాంతరమున ఆధునిక భావాపన్న యగు రమణి, ప్రాచీనకాల సులభమగు సంపూర్ణనిర్భరతను, పరమభక్తినిబూని, భర్తయొక్క జీవనసంగినియై, శ్వశుర గృహపరివారమున ప్రాచీన నిష్ఠనునిల్పిన ఆమెను ఆయన 'ఆదర్శ హిందూపత్ని'గ భావించెడు వాడు. వాస్తవ సన్యాసమువలె యదార్థ నారీ జీవనముగూడ, కేవలము ఆర్భాటమొనర్చి పైకి జూపవలసినది కాదు. ఏ స్త్రీశిక్ష నారీజనోచితములగు సహజగుణ సమూహముల ప్రచారమొనర్పదో, అయ్యది స్త్రీవిద్యా-పదవాచ్యము కాజాలదు.

భావి ఆదర్శ రమణియొక్క గుణావలి ఆభాసద్వైనత్తు ఎచ్చటనైన దొరకగలదేమోయను ఆశతో ఆయన సర్వదా ఔత్సుక్యమును వహించియుండెడివాడు. 'ఒకింత వ్యక్తిస్వాతంత్ర్యముయొక్క వికాసము తప్పక అగును, దాని వెనువెంట, వయస్సు వచ్చినపిదప వివాహమైన తన కనుకూలుడగు పతిని గ్రహించుట జరుగును—ఈ రెండును తప్పని సరి' అని ఆయన తలచెడువాడు. బహుశః, తక్కిన అన్ని ఉపాయముల కంటె ఇదియే బాల్య వైధవ్యజనితములగు సమస్యలనన్నిటిని చక్కపరుపఁజాలును. బాల్యవివాహ-ఆచారము యొక్క ఉత్పత్తి సమాజమొకప్పుడు దానిని ఏరి కోరితెచ్చుకొనుటలోనే ఉన్నదనిగూడ గుర్తుంచుకొన వలయును. ఆలస్యముగ వివాహమైన ఉద్భవించు దోషముల పరిహరింప, ఈ ఉపాయము గ్రహింపబడెను.

భవిష్యన్నారి పూర్వపు ధ్యానశక్తిని సంపూర్ణముగ కోలుపోవునని ఆయన ఒకింతయు ఎంచజాలకుండెను. స్త్రీల కాధునిక విజ్ఞానమును నేర్పవలెను. కాని ప్రాచీన ధర్మభావమును మొదలంట త్రుంచివైచి కాదు. సహజ శరీరమున బయటికి ఏవిధాన మెంతతక్కువ మార్పును గొనిరాగలదో, అయ్యదియే ఆదర్శ-శిక్షయని ఆయన స్పష్టముగ గ్రహించెను. అది కాలక్రమమున ప్రత్యేక నారియు, ప్రాచీన భారతనారీ సమాజముయొక్క మహిమనంతటిని వికసింపజేయగలట్లును ఉండవలెను.

పూర్వపు, ప్రతిజ్వలంత ఆదర్శము స్వతంత్రముగ నిజప్రభావమును విస్తరించెను. రాజపుత్రుల ఇతి హాసము, ఆ నారీ సంఘముయొక్క ఆదర్శము, తేజము, సాహసములతో నిండియున్నది. కాని, ఈ అత్యుష్ణ ద్రవధాతువును, నూతనమగు అచ్చున బోయవలసియున్నది. భారతదేశమున జన్మించిన స్త్రీలందరిలోను రాణీ అహల్యాబాయి శ్రేష్ఠురాలు. దేశమునందంతట ఒనర్చిన లోకహితకార్యముల గాంచి, భారతీయ—సాధు విట్లు భావించుట స్వాభావికము. అయినను, భవిష్యన్నారి మహత్వము సరిగ అట్లే ఉండదు; దానినిగూడ అతిక్రమించిపోవును. రాబోవు యుగమున, స్త్రీ హృదయమున వీరోచితమగు దృఢసంకల్పము జననీసులభ మగు హృదయములయొక్క సమావేశముండును. పవిత్రశాంతి, స్వాధీనతల కాధారభూతయగు సావిత్రి ఏ వైదిక అగ్నిహోత్రాది పరిసరస్థితులనుండి ఉద్భవించినదో, అయ్యదియే ఆదర్శస్థితి. కాని భవిష్యన్నారికి దీనితో మలయమారుతముయొక్క కోమలతా మాధుర్యముల వికాసమును జూపింపవలసియున్నది.

నారికి అధికతరమగు యోగ్యతను జూపింపవలసియున్నది, తక్కువైన మీలుపడదు. ఆయన పరికల్పించు కొనిన విధవాశ్రమము లేక బాలికావిద్యాలయము లేక కాలేజీలో, పెద్దపెద్ద పచ్చికబయళ్లు ఉండును. అచ్చట

వసించువారు వ్యాయామము, ఉద్యానకృషి, పశురక్షణముల ప్రతిదినము తప్పని సరిగ జేయుచుండవలెను' అని ఆయన నుడివెడువాడు. సంసారాశ్రమముకంటె సన్యాసాశ్రమమున ఏ ఉత్తమ ఆదర్శముయొక్క వికాసమధికముగ కనంబడుచున్నదో, దానియందాయనకు ప్రబలానురాగము. ధర్మమే ఈ నూతనవిధములగు ఆశ్రమములకు వెన్నెముక అగును. దీని నాశ్రయించియే అవి పుష్టినందును. ఇందున్నవారందరును, శీతకాలము గడచినతోడనే తీర్థయాత్రలకు బయలుదేరి ఆరునెలలు హిమాలయముల పారాదికము నభ్యసింతురు. ఇట్లు, సృష్టింపబడు నారులు ధర్మ-రాజ్యమున బాషీ-బాజుక్కు'*లవలె నిలబడుదురు; వారే నారీసమస్యల సమాధానమొనర్తురు. వారి కింకొక ఇల్లుండదు; వారు పనిచెయ్యుచోటే వారిల్లు; ధర్మబంధనగాక వారికి వేరొక బంధనముండదు. గురువు, స్వదేశము, జనసామాన్యము-ఈ మూడింటగాక మరి వేటియందు ప్రీతియుండదు. ఆయన కల్పన ఇంచుమించుగ ఇట్లుండెను. కొందఱు శిక్షకురాండ్ర అవసరము మిక్కుటమైనట్లు ఆయన గ్రహించెను; వారి నిట్టే సంగ్రహింపఁదలచెను. శక్తిఅను ఒక్కగుణముయొక్క వికాసమునే ఆయన స్త్రీ పురుషులందరిలో జూడదలంచెను. కాని, శక్తియననేమి? అను విషయము నాయన అత్యంతకఠోరముగ విచారించెడువాడు. తన్నుదా ప్రకటించుకొనుట, లేక భావోచ్ఛ్వాసము—ఈ రెంటిలో దేనిని బ్రశంసించెడువాడుకాదు. ప్రశాంతత, మాధుర్యము, నిష్కలకాదర్శములగు ప్రాచీనకాలచరిత్రల ఆయనమనస్సు అత్యంత విముగ్ధమయ్యెను; అది బాహ్యాడంబరముల నాకర్షింపబడెడిదికాదు. వర్తమానయుగమున భారతము, చింతాజ్ఞానముల సంపాదించిన ఔన్నత్యమున స్త్రీ పురుషులకు సమానాధికారము. సత్యమున లింగవిచారములేదు. ఆత్మ, మనస్సులపై శరీరబంధనమును దృఢమొనర్పగోరు, సాంఘికరాష్ట్రనీతుల ఆయన ఇసుమంతయు సహింపజాలకుండెను. ఏ రమణి ఎంతగొప్పగాగోరిన అంతగ శీలము, మనస్సులనుండెడి, రమణీజన సులభమగు దౌర్బల్యమును అతిక్రమింపవలసియున్నది. భవిష్యత్తున అధిక సంఖ్యాకులగు స్త్రీలు ఇట్టి ఔన్నత్యమునంది ప్రశంసార్హులగుదురని ఆశింపవచ్చును.

స్వాభావికముగనే ఆయన విధవలలోనుండి ప్రప్రథమమున ఇట్టి శిక్షయిత్రుల గ్రహింపనగునని తలపోసెడివాడు. వీరు పాశ్చాత్యదేశమునందలి మఠాధికారిణులవలె నయ్యెదరు. కాని, ఇతరవిషయముల వలెనే, ఆయన ఈ విషయమునుగూడ మరెట్టి సంకల్పమును ఒనర్పలేదు. ఆయన కేవలము ఉచ్చరించినది;

**"లెమ్ము! లెమ్ము! సంకల్పములన్నియు భవిష్యత్తున వాటియంతట అవియే పరిపుష్టములై, కార్యములుగ మారును."** ఇవి అయన పల్కులే. అయినను, ఉపకరణము లరుదెంచిన ఎటనుండి అయినను సరే - వాటిని సాదరముగ గ్రహించెడువాడు. ప్రతిరమణియు సహజమును, సబలమును నగు చరిత్ర, మేధాసహాయ్యములతో సత్యపథమునుండి తన్ను మహాదాదర్శముయొక్క యంత్రముగ ఒనగూర్పకొనజాలకుండుటకాయన, వెదకియు కారణము నొక్కదానినిగూడ కాంచెడువాడు కాడు. అసత్కర్మల

---

*Bashi Bazouks :— వీరు ఖలీఫాల అంగరక్షకులుగ నుండెడువారు. చాలకాలమువఱకు టర్కీసైన్యమున వివిధదేశములనుండి పసికూనల దొంగిలించి తెచ్చి, ముసల్మానుల నొనర్చి, పెంచి పెద్దచేసి జేర్చుకొను ఆచారముండెడిది. దీనిమూలమున, వారికి ధర్మమున అత్యంతానురాగము జనించెడిది; దేశము, రాజు వీటి సేవయనుబంధమే వారిని ఒకట బంధించియుంచెడిది. యూరప్‌యొక్క ఇతిహాసమున వారి క్రౌర్యము, సాహసము, బలములు ప్రసిద్ధినిగన్నవి. నెపోలియన్ వీరినడంచెను.

భారమున మనస్సు పీడింపబడిన, దానిని సరళతవలన సరియొనర్చుకొననగును. నారీ ఉన్నతియన ఉత్సాహితు డగు గ్రంధకారుడు ఒకడు 'స్వాధీనభావమున ఉచ్చ ఆదర్శములనన్నిటిని అనుసరింపవలెను' అని వ్రాసెను. స్వామిజీకూడ స్వాతంత్ర్యమనిన భయపడెడువాడు కాడు, భారతీయ నారీజాతిని సందేహించెడువాడు కాడు. కాని ఆయన ఏ స్వాధీనతయొక్క వికాసమును సంకల్పించెనో అది, ఆందోళన, పెడబొబ్బలు, ప్రాచీనరీతుల భంగించుటవలన సాధింపబడునది కాదు. అది పరోక్షభావముగ, నీరవముగ లోనుండి దాని యంతట అదియే సాధితమవవలెను. ప్రధమమున నారీసమాజమున నున్న ఆదర్శముల నతశిరమున గ్రహింప వలెను. గుణోన్నతినిబట్టి వారు జాతీయజీవనమందలి విశిష్ట నిర్దేశములను, సుయోగములను అధికముగ గుర్తింప గలుగుదురు. ఈ కర్తవ్యములనన్నింటిని పాలించి, ఈ సుయోగములనన్నిటిని సంపూర్ణముగ గ్రహించి, వారు మునుపటికంటె ఎక్కుడుగ భారతీయ భావాత్మకలయ్యెదరు; ప్రాచీన భారతము స్వప్నమునగూడ భావింపని ఉన్నతియొక్క ఉచ్చశిఖరముల నధిరోహింతురు.

*  *  *  *

వివేకానందుని దృష్టిలో సన్యాసియొక్క వ్రతములన్నియు వెలలేనివిగ నుండెను. వాస్తవిక సన్యాసుల వలె, ఆయనగూడ వివాహము తత్సంశ్లిష్ట విషయముల నన్నింటిని మహాపాపముగ పరిగణించెడువాడు......

కాని, ఆయన నారియనిన భయపడెడువాడు కాడు, ప్రలోభన యనిన భయంపడెడువాడు అని గుర్తించుకొనుట ముఖ్యము. పృధివియందు సర్వత్ర ఆయనకు నారితో సంబంధమొడగూరెను. వారాయన శిష్యులు, కార్యసహాయ్యకలు, మిత్రులు, ఆటంజట్లు. పరివ్రాజక జీవనమున ఆయన వీరితో భారతీయ మర్యాదననుసరించి మెలగెడివాడు; ఎట్టి సంబంధమును ఉంచుకొనెడువాడు కాడు....ఆయన స్త్రీలయందు క్షుద్రతా దౌర్బల్యములకు మారు, మహత్వము చరిత్రబలములనే అన్వేషించెడువాడు. ఆయన అమెరికాలో స్త్రీలు నౌకలను నడుపుట, ఈదుట, నానావిధములగు ఆటలనాడుట గాంచినాడు, కాని, పురుషులకంటె అన్యముగ ఎప్పుడును వారిని మనస్సున భావింపలేదు. అందువలన ఆయన మిక్కుటముగ ఆనందము నందెడు వాడు. ఇట్లు, వారినుండి బహిఃప్రకాశమునందు ఆదర్శమునే ఆయన పూజించెడువాడు.

సన్యాసి విషయమై ఆయన విశేషముగ జెప్పెడిది: సన్యాసి తన్ను పురుషునిగగాని స్త్రీగగాని భావించుకొనగూడదు; అతడీ రెండింటికి ఆవల లింగభేదమును స్ఫురింపజేయు శిష్టాచారములేక మరేదైనను ఆయన అత్యంతముగ గర్హించెడువాడు. పాశ్చాత్యుల Chivalry (స్త్రీ-సౌజన్యబోధకము) అనిన ఆయన తలపులో స్త్రీల నవమానించుటయే. కొందఱు గ్రంథకారులు స్త్రీలకు ఒకమాదిరి విద్య అబ్బిన చాలందురు; సంపూర్ణముగ అవసరములేదని వారి తలపు. కాని, స్వామిజీ ఈ అభిప్రాయమును అత్యంతనీచముగను, హేయముగను గాంచెడువాడు. మానవుని అంతరాత్మ కోరునది స్వాధీనత - మన శరీరముయొక్క రీతి ఈ స్వాధీనతపై బంధనములనన్నిటిని బలవంతముగ తెచ్చిపెట్టినది. స్త్రీ పురుషులందరును దీనిని అతిక్రమింప యత్నింపవలెను.

ఆదర్శ-పత్ని అవవలననిన, పతియందు ఎదుగు తగ్గులులేని ఉజ్వలనిష్ఠయే కావలెనని, ఆయన ప్రాచ్యులవలె తలపోసెడువాడు....ఆయన ఎప్పుడు సంఘ-ఆదర్శములను తూలనాడలేదు. క్రీ.శ. ౧౮౯౯లో ఇంగ్లండునకు పోవుచు ఓడదిగుటకు ముందు ఆయన నాతో, 'పాశ్చాత్య-సమాజ ఆదర్శములను వాటిసెన్నడును

పరిత్యజింపనట్లు, మరల గ్రహింతునుగాక' అని నుడివెను. యూరప్ లేక అమెరికాలో వివాహితలు అవివాహితలకంటె తక్కుడు సమ్మానమును ఆయనకడనుండి పొందెడివారు కారు. ఈ సముద్రప్రయాణమున, కొందఱు పాదరీలు వారు దుర్భిక్షాసమయమున అరవస్త్రీలనుండి కొన్న వెండిమురుగులను (వివాహ-కట్నము) జూపించుచుండిరి. సంభాషణలలో 'ప్రాచ్య పాశ్చాత్య స్త్రీలందరుగూడ, వివాహ-ముద్రికలను మూఢ ఆచారమున దీయ నిచ్చగింపరు' అను విషయము వచ్చెను. దానిని వినుటతోడనే స్వామిజీ ఖేదముతో 'దానిని మీరు మూఢాచారము అనుచున్నారా? దానివెనుక, సతీత్వముయొక్క మహాదాదర్శమున్నది - మీరు గాంచజాలకున్నారా?' అని నుడివెను.

ఆధ్యాత్మిక-స్వాతంత్ర్యమునందలి వివాహమెంతగ తోడ్పడగలదు - అను విషయము ననుసరించియే ఆయన దానియొక్క గుణాగుణముల విచారించెడువాడు. ప్రసంగక్రమమున ఆయన ఒకరోజున ఇట్లొప్పుకొనెను; 'వివాహము నతిక్రమింపజేసుకొను వివాహమన, నాకేమియు అభ్యంతరములేదు.' ఆయన గురుదేవునియొక్కయు, గురుభ్రాతయగు యోగానందునియొక్కయు, శిష్యుడగు స్వరూపానందునియొక్కయు వివాహములే, ఆయన దృష్టిలో ఆదర్శవివాహములు....

ఆయన సన్యాసిసంఘమును, ఆచార్యుని పశ్చాద్వర్తియగు సైన్యదళముగ భావించెడువాడు; ఏ ఆచార్యుని శిష్యులందరును గృహస్థులు సంసారులో ఆయనకు సైన్యములేదు, అనికూడ నుడువుచుండెడువాడు.... అయినను వివాహముగూడ చాలమందికి ఒక మార్గమని ఆయన బొత్తిగ గ్రహింపలేదనికాదు. ఆయన ఒకానొక వృద్ధదంపతులనుగుఱించి చెప్పిన కథను నేనెన్నడును మరువజాలను: ఏబదిఏండ్లు వారొకచోట నివసించి దరిద్రనివాస.ద్వారమున (Work-House) విడివడిరి. ప్రథమదినావసానమున వృద్ధుడు 'మేరీ! నిద్రించుటకు బూర్వము నిన్నొకసారి గాంచి, చుంబింపజాలనా? నేను గత ఏబదిఏండ్లనుండి ఇట్లొనర్చుచుంటినే?' ఈ మహోన్నతభావమును బరికించుచు స్వామిజీ వ్యగ్రుడై, 'ఒక్కసారి భావించిజూడుము! ఒక్కసారి లక్షించి చూడుము! ఇట్టి సంయమయు, నిష్ఠలే యుక్తి!' ఈ ఇద్దరి పక్షమున వివాహమే ప్రశస్తపథము.

'ఇచ్ఛలేకున్న, వివాహమొనర్చుకొనకుండుట స్త్రీలకు స్వాభావికముగ ఒసఁగదగిన స్వాతంత్ర్యము' అని ఆయన పలుమారులు దృఢముగ చెప్పియుండెను. ఒక బాలికయందు ధర్మజీవనానురాగము పదిరెండేండ్లు నిండకమునుపే పొడజూపెను. ఆమె వివాహము బారినుండి తప్పించుకొన స్వామిజీ సహాయ్యము నర్థించెను. ఆయన, ఆబిడ్డ ఇంటివారికి నానావిధముల తెలియజెప్పి, సాయమొనరింపగలిగెను....ఇట్టి మహోన్నత మనస్కులకు వివాహమొనర్చుట అత్యంత గర్హితకృత్యమని ఆయన తలఁపు.

విధవల సతీత్వమను స్తంభముపైననే సామాజిక అనుష్ఠానములన్నియు నిర్భరపడియున్నవని ఆయన చెప్పెడువాడు. ఈ విషయమున స్త్రీలకువలెనే పురుషులకుఁగూడ మహోన్నతాదర్శముండవలెననిగూడ ఆయన ఘోషించియుండెను. ప్రాచీనార్యులమధ్య చిరాచరితమగు ఒక ఆచారముండెను—వివాహకాలమున అగ్ని స్థాపింపబడెడిది; భార్యాభర్త లిర్వురును దానిని ప్రాతఃస్సంధ్యల నుపాసించెడువారు. ఈ అనుష్ఠానమున దెలియవచ్చెడిదేమన, భార్యాభర్త లిర్వుర ఆదర్శము, భారము సమానము. మహర్షి వాల్మీకి మహాకావ్యమున రామచంద్రుని ప్రతి సీతయొక్క అవిచలిత నిష్ఠ వర్ణింపబడినట్లే, సీత ప్రతి రామచంద్రుని అవిచలిత నిష్ఠగూడ వర్ణితము.

## వివేకానందుని దృష్టిలో భవిష్యన్నారీ సమాజము

పృథివియందు సర్వత్ర వివాహవిషయమున నున్న సామాజిక సమస్యలన్నియు స్వామీజీకి అవిదితములు కావు. పాశ్చాత్యదేశమున ఉపన్యసించుచు సవిస్మయముగ, 'ఈ గయ్యాళులందరు - వీరినుండి సహించు, క్షమించు ప్రభృతి శబ్దములు సంపూర్ణముగ విలుప్తములు.' 'వివాహబంధమును అక్షుణ్ణముగ నుంచిన భవిష్య జ్జాతికి విశ్వాసఘాతకతాకరముగ నుండుపట్ల, భార్యాభర్త లిద్వరకు వివాహవిచ్ఛేదమే గొప్పదనము, సాహసము' అని నుడువుటకుగూడ ఆయన సంకోచింపలేదు. ఆయన, ప్రాచ్య పాశ్చాత్యములు రెండును పరస్పర-ఆదర్శముల ఆదానప్రదానపూర్వకముగ నవత్వమునందుట అవసరమని సర్వదా నిరూపించెడు వాడు. ఎట్టి సాంఘిక నియమమును ఆయన ముందువెనుక లాలోచింపకుండ దూషించెడువాడు కాడు. ఆయా ఆచారములు ఒకానొక దురాచారమును రూపుమాపుటకై ఉద్భవించియుండుననియు, తత్సమా లోచకులు ఏకదేశత్వదోషమున దానిని గ్రహింపజాలకున్నారనియు వచించెడువాడు. కాని, గడియారము యొక్క 'ఊగులాడు బిళ్ల' ఒకవైపునకు ఒరిగిన ఆయన తక్షణమే దానిని గ్రహింపగలిగియుండెను.

భారతవర్షమున వివాహము వధూవరుల ఇష్టము ననుసరింపక, పెద్దల వ్యవస్థ ననుసరించియుండుటను విషయమును ప్రసంగించుచు ఆయన ఇట్లు పల్కెను. 'ఆహా! ఈ దేశమున ఎట్టి కష్టము, బాధ ఘటిల్లినది. దాని అవసరము ఒకింత అన్నిసమయముల నుండెను. కాని, ఇప్పుడు యూరోపియనులుకూడ వారి రీతినీతుల జూపించి, కష్టమును మరింత పెంపొందించిరి. ఇప్పుడు సమాజము గ్రహించినది వేరొక దారికూడ ఉన్నదని.'

ఒకానొక యూరోపియన్‌తో ఆయన ఇట్లు పల్కెను: 'మేము మాతృభావమును పెంపొందించితిమి, మీరు భార్యా భావమును; నేతలచునది పరస్పరగ్రహణమున ఉభయులకు లాభము చేకూరగలదని.'

తర్వాత ఆయన స్వప్నకథ; ఆయన ఓడలో దానిని మాకిట్లు వర్ణించి చెప్పెను: 'స్వప్నమున నేను ఇరువురు వ్యక్తులు వాదించుచుండుట వింటిని—వారు ప్రాచ్య పాశ్చాత్య వివాహాదర్శములనుగురించి ఆలోచించుచుండిరి. చివరకు వారొనర్చిన సిద్ధాంతమియ్యది: రెంటను ఉన్న కొన్ని విషయములు ఇప్పుడు గూడ జగత్తునకు హితకరములగుటవలన అపరిత్యాజ్యములు.' ఈ దృఢవిశ్వాసముండుటవలననే—ఆయన ప్రాచ్య పాశ్చాత్య సమాజాదర్శముల మధ్యనున్న ప్రభేధమును విశేషముగ జూడ అంత సమయమును వెచ్చ బెట్టెడువాడు.

## వ్యాసకర్తల కొకమనవి

వ్యాసములును కథలును నాలుగైదు పేజీలకు మించియుండిన వెంటనే ప్రచురింపబడుటకు అవకాశముండదు. ఎంత క్లుప్తముగ నున్న అంత యాదరమునకు పాత్రములగునని గమనింప కోరుచున్నాము.

సంపాదకుడు.

# ప్రబోధము

గీ. పెండ్లికాఁగ నత్తింటికి వెడలవలయుఁ బుట్టినిల్లన్న భ్రాంతిని నెట్టివైచి
యెన్నికష్టంబులున్నను నెన్నఁదగిన సౌఖ్య మత్తింటనేకదా జరుగునెపుడు.

గీ. పడఁతి పుట్టుకతోడనే పరునిసొత్తు నీటముంచినఁ బాలముంచినను ప్రాణ
కాంతుఁడే దైవమంచు నెక్కాలమెంచి యతని మెప్పించి మెప్పొందనగు సతికి.

గీ. అత్తమామ లెంచఁగఁ గఠినాత్ములైన మించు వేడుక భర్త ప్రేమించెనేని
పుట్టినింటాసకై లోనఁ బొంగఁబోక కష్టమెంతైన భరియింపఁగలదు కాంత.

ఉ. అల్లుఁడు వచ్చునంచునె దనత్తయు మామయు సంతసంబులోఁ
బెల్లుగఁ దాల్చుచుండు రటుపిమ్మట వచ్చిన యంతలోన బల్
ప్రల్లదవాక్యముల్ బలికి రాపిడిసేతురు తప్పులెన్నుచున్
చెల్లునె యత్తయింట నివసించుట పెక్కుదినంబు లేరికిన్.

గీ. అరయఁ బుట్టింటఁ బంచభక్ష్యపరమాన్న మారగించుటకంటె సౌఖ్యంబెసంగు
నబల కొక్కకబళమైన నత్తగారి గృహమునందు స్వాతంత్ర్యమై యొనయుఁగాన.

గీ. పుట్టినిల్లన్నమాత్రానఁ బొంగరాదు
ప్రేమమెంతఁగా నటనున్న నేమియగును?
గౌరవంబించుకైనను గానరాదు
స్వేచ్ఛ నలుసైనలేక జీవింపఁదగునె?

గీ. అత్తమాటల కెద్దురాడనేర్చి
భర్త యానతికెప్డు మార్వలుకనేర్చి
పుట్టినింటికేగిన నేమి పొసఁగఁగలదు
పుట్టిపెరిగిన-చోటనే ముట్టిపడును?

గీ. పుట్టినింటికిఁ బతితోడఁ బోయినపుడె
గౌరవోన్నతులెన్నైనఁ గలుఁగఁగలవు
సాధ్వికప్పుడె ముద్దుముచ్చటలుదీఱు
నట్లుగాకున్న నేరీతి హర్ష మొదవు.

—శ్రీ ఇనుగంటి సరస్వతీదేవి.

## *Messages and good wishes to 'Grihalakshmi'*

***From***

# K. SITARAMA SASTRI, M.A.,

***To***

*The Proprietor,*

**"GRIHALAKSHMI" MADRAS.**

***Sir,***

The success of any endeavour depends, to a considerable extent, on the ideals with which it works. Much ink has been split on the controversy whether an ideal be an accomplished fact but, 'Grihalakshmi' has demonstrated more than once, to the world that its achievement is in perfect harmony with its ideal.

The ideal of Indian womanhood as set up and developed by a succession of able and talented editors of 'Grihalakshmi' has become a model to be followed by politicians, statesmen and social reformers and a light to enlighten men of letters. The present editor has been taking great pains not only in maintaining her original position and rank but also in making her occupy the foremost place among the magazines of India.

I wish him every success and hope to see the day when Grihalakshmi will be published in all the languages of India.

MADRAS,<br>7—2—1940.

*Yours sincerely,*<br>(Sd.) K. SITARAMA SASTRY.

### 'గృహలక్ష్మి' పత్రికాధిపతులకు శ్రీ కే. సీతారామశాస్త్రి ఎం. ఏ. గారు పంపిన హిత సందేశార్థము

ఏ కార్యముయొక్కయు విజయము చాలవరకు . ఆ ప్రయత్నముయొక్క సదాదర్శములపై నాధారపడియుండును. ఆదర్శము అనుభవయదార్థమగునా కాదా యను వివాదాంశముపై వెలువడిన తీవ్రవాదరచన లెన్నియోగలవు. ఆదర్శమును అనుభవానందముతో సమన్వయింపగల శక్తిని 'గృహలక్ష్మి' చాల పర్యాయములు ప్రపంచమునకు ప్రత్యక్షమొనరించినది. 'గృహలక్ష్మి' పత్రికయందు, ప్రతిభావంతులై, పేరెన్నికగన్న సంపాదకవర్గముచే ప్రతిష్ఠితములై, పెంపొందింపబడిన స్త్రీధర్మాదర్శములు, రాజకీయవేత్తలకును, రాజధర్మప్రవీణులకును, సంఘసంస్కర్తలకును మంచి మార్గదర్శకములై యొప్పుటేకాక నీపత్రిక విద్యాసంపన్నులకుగూడ విజ్ఞానదీపికయై విలసిల్లుచున్నది.

ప్రస్తుత సంపాదక కార్యనిర్వాహకుని పటుదీక్షాపరిశ్రమాసక్తిచే నీపత్రికయొక్క పూర్వపు పేరుప్రతిష్ఠలు పెంపొందింపబడుటేకాక, భారతదేశపు పత్రికలలో 'గృహలక్ష్మి'కి ప్రత్యేకప్రాముఖ్యతను పొందజేయుటకుగూడ ప్రయత్నమొనరింపబడుచున్నది. ఈయన సత్ప్రయత్నములు జయప్రదమగునట్లభిలషించుచు, 'గృహలక్ష్మి' హిందూదేశములోగల యన్నిభాషలలోను వెలువడు సుదినము నుత్సాహముతో నిరీక్షించుచున్నాను.

*From*

MISS RAJKUMARI VARADARAJULU M. A., (Cantab)

*Dear Editor,*

I have read with great pleasure your article on బుద్ధిప్రభుత్వము—ప్రేమపెత్తనము and the two appreciations that followed it. The one written by Sri Gonela Narasinga Rao is undoubtedly of high order giving at the same time the true colour to your article. To my knowledge I have been reading his articles for about three years and what little Telugu I know is due to such eminent contributors as Mr. Gonela Narasinga Rao, Kanuparthi Varalakshmamma, V.A. Suryanarayana, A. Satyavathamma and last but not least K. Sugunamani.

Your Magazine, I am glad to say, has been maintained in a high literary standard all along and more so for the last one year. It is no exaggeration if I say that the Editorial articles of these ten months are eminently superb.

I have got some doubts about certain points in the appreciation written by Mr. Narasinga Rao which I hope to be enlightened by an elaborate explanation on the part of the critic. Since there is no other means to get at Mr. Narasinga Rao except through your Journal I should doubtless get my doubts cleared only through the columns of your "Grihalakshmi." I request you, therefore, to publish the accompanying small article in your March issue so that Mr. Narasinga Rao may understand my doubts and comply with my request for clarification of implied ideas. I do not mean to criticise a very eminent Telugu scholar of the calibre of Mr. Narasinga Rao but nevertheless I sincerely feel that I should know some what more elaborately than what is already there. So please assure Mr. Narasinga Rao that my request for explanation does not arise out of anything other than enthusiasm-pure and simple-to grasp fully the connotation and denotation of some of the terms that he has used. I am really at a loss to understand and hence this letter.

I wish every success to your esteemed Journal.

MADRAS,<br>6—2—1940.

*Sincerely yours,*<br>*Dear Editor,*<br>(Sd.) A. RAJKUMARI.

# సందేశము - సందేహము

శ్రీ రాజకుమారిగారు ఎం. ఏ. (క్యాంటబ్)

బుద్ధి ప్రభుత్వము — ప్రేమపెత్తనము అను (మీ సంపాదకీయ) వ్యాసమును, అందుపై వ్రాయ బడిన రెండు విమర్శనావ్యాసములను అమితానందముతో చదివితిని. శ్రీ గోనెల నరసింగరావుగారు వ్రాసిన విమర్శనావ్యాసమెంతయు ప్రతిభావంతమై మీ వ్యాసమున కధిక శోభ నొడగూర్చెను. ఆయన వ్యాసములను సుమారు మూడుసంవత్సరములనుండి చూచుచుంటిని. నాకు గల కించతు తెలుగు భాషాజ్ఞానము ఉత్తమ వ్యాస రచయితలగు శ్రీ గోనెల నరసింగరావు, శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మ, శ్రీ విం. అ. సూర్యనారాయణ, శ్రీమతి ఆచంట సత్యవతమ్మ, శ్రీమతి కే. సుగుమణి గార్లు 'గృహలక్ష్మి'లో వ్రాసిన వ్యాసములను చదువుటవలన గలిగినది. మీ పత్రిక మొదటినుండియు ఉన్నతాదర్శముల నుద్దీపించు భాషాసేవచేయుచు నీ సంవత్సరములో నధిక ఘనతతో వెలయుచున్నదని చెప్పుట కెంతయు సంతసించుచున్నాను. గత పదిమాస ములలో 'గృహలక్ష్మి'లో ప్రచురింపబడిన సంపాదకీయవ్యాసము లత్యుత్తమప్రతిభతో వెలయుచున్నవనుట అతిశయోక్తి కాదు.

శ్రీ గోనెల నరసింగరావుగారి విమర్శనావ్యాసమును చదివినమీదట నాకు కొన్ని సందేహములు కలిగినవి. ఆ సందేహములకు సదుత్తరములను మీ పత్రికద్వారా పొందగోరి వాటి నిందుతో పంపుచున్నాను. వాటిని మీరు మార్చి 'గృహలక్ష్మి'లోనే ప్రచురించి, శ్రీ నరసింగరావుగారి కందజేసి వారి వ్యాసము నందలి భావగర్భితములగు విషయములను వారు విశదీకరించుట కవకాశమొసంగ నభిలషించుచున్నాను. తెలుగుభాషలో ప్రశస్త పాండిత్యముగల శ్రీ నరసింగరావుగారిని ఈ నా సందేహములకు సమాధానమొసంగ గోరుట వారి విమర్శనావ్యాసమునందలి గుణదోషములను పరిశీలింప నుద్దేశించికాదు. ఆ వ్యాసములో ప్రయో గింపబడిన ప్రత్యేకపదములు నాకు బాగుగ బోధపడనందున అందలి యర్థమును విపులముగ తెలిసికొన నుత్సా హించుటచే నీ జాబును తమకు వ్రాసితిని. పేరెన్నికగన్న మీ పత్రిక జయముతో వర్ధిల్లుగాక!

బుద్ధిప్రభుత్వము - ప్రేమపెత్తనము అనే వ్యాసాన్ని చూచాను. శ్రీగోనెల నరసింగ రావుగారు ఈవిమర్శను చాలాకూలంకషంగా వ్రాశారు. ఇది డిశెంబరుసంచికలో సంపా దకులు వ్రాసిన వ్యాసములోని విషయాల్ని బాగాబోధపర్చింది. కాని నాకుయీ విమర్శ చదివినతరువాత అక్కడక్కడకొన్ని కొత్తసందేహాలుకలిగాయి. ఆసందేహాల్ని తీర్చు కుందామని వ్రాస్తున్నాను. "పసినిసుంగులయెడ ప్రేమ ముద్దు" యిందులో ముద్దుకు ఒక సంస్కృతపదము దొరకలేదా? "స్త్రీకి వివేకహీనమైనబుద్ధి యున్నప్పుడుగాని పురుషునకు ప్రేమహీనమైన బుద్ధియున్నప్పుడుగాని" అంటే వీటి అర్థమేమిటి? వివేకహీనమైనప్రేమ పేరే మిటి? ప్రేమహీనమైనబుద్ధి పేరేమిటి? బుద్ధిప్రేమలు కలసియున్నప్పుడు దానిపేరేమి?

బుద్ధికి ప్రేమకు అవినాభావసంబంధమని చదువుకున్న వాళ్లంటారు. ఇందులో సత్యములేదా? ప్రేమలేకుండా బుద్ధివుంటుందా? బుద్ధిలేకుండా ప్రేమవుంటుందా? డిశం బరు సంచికలో సంపాదకులువ్రాసిన వ్యాసములో "బుద్ధి పర్వతమువంటిది. ప్రేమ సముద్రమువంటిది. ప్రేమఅను క్షీరసాగరములో బుద్ధిఅను మేరుపర్వతము తేలుచుండును. బుద్ధి సూర్యునివంటిది. అనగా జ్ఞానమను వెలుగుతో వెలయుచుండుశక్తి ప్రకాశము. ప్రేమ చంద్రునివంటిది, ఆనందమను ఆహ్లాదకరమగుకాంతితో నిండియుండును" దీని అర్థమేమి?

శ్రీ రాజకుమారిగారి సందేహములకు మా కోరికపైన సత్వరమే జవాబువ్రాసి త్వరలో మాకందజేసిన శ్రీ నరసింగరావుగారి కెంతయు కృతజ్ఞులము. (గ్రం॥ సం॥)

# సమాధానము

శ్రీయుత గోనెల నరసింగరావుగారు ఎం. ఏ. బి. యల్.

ం

శ్రీ కుమారి రాజకుమారిగారి సందేహములను శ్రద్ధతోఁ జదివితిని. అందలి ప్రశ్నలకుఁ దగు రీతి సమాధానము లీయవలసినదని నన్నుఁ గోరుటచేత నా శక్తిఁగొలఁది వ్రాయఁ గడంగుచున్నాను. ఈ చిన్నవ్యాసము నామె చదువుకొన్నమీఁద సందేహనివృత్తి కావచ్చునని తలంచుచున్నాను. ఆమె శంకలకీ ప్రత్యుత్తరము వంకలుతీర్చనఁ జాలును. నేను ధన్యుఁడననుకొందును. ఉత్తమోత్తముఁడ ననుకొందును. ఆంధ్రనారీమణులలో నొక్క విదుషీమణియైన నా వ్యాసమునుఁ జదివి యందలి విషయమును సమగ్రముగఁ గ్రహించి, సందేహము లున్నయెడలఁ బ్రశ్నల వెలయించి, సమాధానము వాంఛించినందుల కమందానంద మొందఁగల్గుదును.

'ముద్ద' నే తెలుఁగుపదమునకుఁ మనమిదివఱకు జెప్పుకున్న సందర్భమునకు సరియైన సంస్కృతపదము లేదనియేఁ జెప్పవచ్చును. 'చుంబన' మనఁగ ముద్దని యర్థమువచ్చును. ఈచుంబన మొక్క పతినిసుఁగులయెడఁ జూపెడు హార్దవిశేషమే యని నొక్కి చెప్పఁగలమా ? లేదు. వాత్సల్యములో, ప్రణయములో, భక్తి మార్దవములోకూడ నీ 'చుంబ'నము నెదుర్కొనవలసి వచ్చుచుండును. కాక, 'చుంబ'న మనునది ప్రేమయొక్క బాహ్యచిహ్నము. తెల్గుఁగుభాషలో 'ముద్ద'నునది పసిపాపలయెడఁ గనుపఱచు ప్రేమయొక్క యంతర జ్యోతి. కావున 'చుంబన' మను సంస్కృతపదము 'ముద్ద'ను తెలుఁగుపదమునకు సరియైనది కాఁజాలదు. ఇఁక 'ప్రేమ' యను పదమును ప్రీతి, ప్రియము, ప్రియత్వము, ప్రీతము, ప్రీత, హార్దము యిత్యాది నామములతోఁ బిలుచుకొనవచ్చును. కాని యీ పదములలో నొక్కటైనను ముక్తసరిగ 'ముద్ద'ను పదమునకు సరిపోవుటలేదు. కాఁబట్టి తెలుఁగుపదమును వాడితిని. కాక, తేఁటతెల్లముగనున్న తెలుఁగుపదమును వదలుకొని సరియైన యర్థమునకు దూరస్థమైన సంస్కృతపదము నేరుకొనుటకొఱకు శ్రమించుట నవసరమని తలఁచి, 'ముద్ద'ను తెలుఁగుపదమును ముద్దుముద్దుగ నచ్చట ముచ్చటగఁ జెప్పితిని అయినను సంస్కృతపదమే కావలసినచో 'ప్రియ' మనుకొనవచ్చును.

'స్త్రీకి వివేకహీనమైన ప్రేమ యున్నప్పుడుగాని పురుషునకు ప్రేమహీనమైన బుద్ధి యున్నప్పుడుగాని' యన్న వాక్యము నర్థముచేసుకొనుటకు ముందు 'బుద్ధి' 'ప్రేమ' యను ప్రవృత్తులు మానవతత్వములో నిమిడియున్న రెండు ప్రత్యేక గుణవిశేషములని గ్రహింపవలసియున్నది. 'బుద్ధికి', 'ప్రేమకు' భేదమున్నది. బుద్ధి మానవుని శిరముతో సంబంధించియున్నది; ప్రేమహృదయముతో సంబంధించియున్నది. శిరము పని శిరస్సును హృదయము పని మనస్సును జేసుకొనుచుండును. ఉదాహరణకు:-బక్కచిక్కిన పేదవాని దిక్కుమాలిన తనమునకుఁ గన్నులు చెమ్మగిల్లును. తరువాత బుద్ధి నిర్ణయించును. (ఆ పేదవాని యాకఁటిచిచ్చుఁ దీర్చుట కొక కాణియో లేక యర్ధణాయో వాని కొసఁగుట యనుకొనుఁడు.) ఈ సందర్భమునఁ గన్నులకుఁ జెమ్మఁ గలిగించుట 'గుండె' పని. ఏలన హృదయము ప్రేమస్థానము గనుక. తదనంతరముపకారమొనరించుటకొక నిశ్చయమునకు రప్పించుట 'తల' పని ఏలన శిరస్సు బుద్ధిస్థానము గనుక. కావున గుండెతోఁ గరఁగి బుద్ధితో సిద్ధసంకల్పుఁడగును. అనఁగ హృదయమును శిరమును వేర్వేరు ప్రవృత్తులతోఁ గూడినవని గ్రహింపవలెను.

ఇఁక 'వివేకహీనమైన ప్రేమ' యనఁగఁ బైనిఁ బేర్కొన్న ద్విగుణములలో నొక్క 'ప్రేమ'కే యగ్రస్థాన మీయవలసివచ్చును. అచ్చట బుద్ధివికాసము లేకపోవచ్చును. ఒకవేళ యున్నను నయ్యది వెలవెల బారుచుండును. అనఁగ ప్రేమకే ప్రాధాన్యమీయవలసివచ్చును గనుక, బుద్ధిసూక్ష్మత యంతగ నుండదు గనుక 'వివేకహీనమైన ప్రేమ' యని వ్రాసుకొంటిని. ఆ ప్రేమ కేవలము బేలతనమును బ్రకటించుచుండును. అందులో బుద్ధిప్రాభవమంతగఁ గన్పట్టదు. ఈ సందర్భములో ప్రేమ యను ప్రవృత్తికే విశేష ప్రాముఖ్యమీయవలయును. ఈవిధముగ నవగాహనమొనరించుకొనుటయే లెస్స. అంతియకాని వివేకహీనమైన ప్రేమ యన్న బుద్ధిమాలిన ప్రేమయనిగాని, యవకతవక ప్రేమయనిగాని యర్థము చేసుకొనఁగూడదు. అటులనే 'ప్రేమహీనమైన' బుద్ధి యన్నప్పుడు బుద్ధికి ప్రధానస్థానమీయవలసియుండును. అనఁగ నిచ్చట బుద్ధి సముజ్జ్వలముగఁ బ్రకాశించుచుండును. ప్రేమ యంతగఁ గాన్పించదు. ఈ పరిస్థితిలో బుద్ధి విశేషముగను, ప్రేమ కొలఁదిగనో లేక హుళక్కిగనో నుండును. కావున బుద్ధికే నత్యున్నతస్థాన మీయవలసియుండును. అంతియె కాని 'ప్రేమహీనమైన' బుద్ధియన్న పనికిమాలిన బుద్ధియనిగాని, యల్లరచిల్లర బుద్ధియనిగాని యనుకొనరాదు.

అట్టియెడ 'వివేకహీనమైన ప్రేమ' యనఁగఁ బై చర్చను బురస్కరించుకొని మాట్లాడ నుంకించినప్పుడొక్క ప్రేమకే ప్రాధాన్యమొసంగవలసివచ్చును గావున, వివేకమచ్చోటఁ దత్సమానముగ వికసింపలేదు గావున, బేలతనమనిగాని, యమాయకత్వమనిగాని, మోహమనిగాని వ్యవహరింపవచ్చును. అటులనే 'ప్రేమహీనమైన బుద్ధి' యనఁగ నొక్కబుద్ధికే యచ్చోట ప్రాముఖ్యమీయవలసివచ్చును గనుక, ప్రేమ యను దైవీ ప్రవృత్తి తేజోహీనమయినదని యూహించి 'బుద్ధి' యనిగాని, మేధ, మనీషా, శేముషీ, ధీ, ప్రజ్ఞ, ధిషణా, మతి, మున్నగు నామములతోఁగాని వ్యవహరింపవచ్చును. తెలుఁగుభాషలో నద్దానిని 'తెలి'వని పిలువవచ్చును.

తరువాతి ప్రశ్న 'బుద్ధి, ప్రేమలు కలసియున్నప్పుడు దాని పేరే'మని. ఈ ప్రశ్నకు సరియైన సమాధానమిచ్చుటకే నేనింత విస్తరించి వ్రాసినది. ఒక్క ప్రేమ మాత్రమే యున్న నయ్యది బేలతనమనిగాని, యమాయకత్వమనిగాని, మోహమనిగాని యనిపించుకొనుచున్నదని యిదివఱకే యనుకొనియుంటిమి కదా. ఉ॥ 'ఆమె బేల' 'ఆయన యమాయకుఁ'డని వ్యవహరించినప్పుడంత యుత్సాహవంతముగ నుండదు. ఏలనన నా వ్యక్తిలో ప్రేమ దివ్యముగఁ బ్రవహించుచున్నను తెలివితేఁటలు లేవేమో యన్న సందేహము కలుగును. ఆవిధముగనే యొక్క బుద్ధికుశలతయే యున్న నయ్యది 'శేముషి' యనిపించుకొనుచున్నది. ఉ॥ 'అతఁడు మేధావి', 'అశేష ప్రజ్ఞావిశేషముఁ గలవాఁడు' యన్నప్పుడు కుశాగ్రబుద్ధిఁ గలవాఁడని గ్రహింపవలసియున్నను ప్రేమ రుధిరము గడ్డకట్టిన 'మనీషఁ' గలవాఁడేమో యన్న సంశయము తలసూపుచుండును. కావున ప్రేమతోఁగూడిన బుద్ధి యున్నప్పుడు, బుద్ధితోఁగూడిన ప్రేమ యున్నప్పుడు 'విజ్ఞాన' మని వ్యవహరింపవలసియుండును. ఈ రెండు ప్రవృత్తులే వ్యక్తియందుఁ గనుగొందుమో యాతఁడే విజ్ఞుఁడు. విజ్ఞానమెచ్చట నుండునో యచ్చటనే పరిపూర్ణ మానవత్వము ప్రత్యక్షమగుచుండును. అట్టి సంపూర్ణ మానవత్వమే, 'సత్యం, శివం, సుంద'రమని గ్రహింపవలసియున్నది.

'బుద్ధి'కి 'ప్రేమ'కు నవినాభావసంబంధమున్నది లేనిది, యట్టి సంబంధమున్న నెచ్చటనున్నది, లేనిచో నెచ్చట లేకపోయినది పై వాక్యములను బూర్తిగ యర్థముచేసుకున్నయెడల తామే నిర్ణయించుకొనఁగలరని నమ్ముచున్నాను. కాని 'బుద్ధి' 'ప్రేమ' యనునవి రెండు ప్రత్యేక ప్రవృత్తులన్న చిన్న మాటను

విస్మరింపఁగూడదు. ఈ రెండు ప్రవృత్తు లైక్యమైననాఁడే విజ్ఞానముద్భవించును. అట్టి విబుధుఁడే విజ్ఞుఁడు. అట్టి విజ్ఞుఁడు హృదయమార్దవముతో శేముషీవిభవముతో వెలిఁగెడు పుణ్యమూర్తియని గ్రహింపవలెను. అట్టి విజ్ఞాన జ్యోతిర్మయమూర్తి శ్రీరామకృష్ణుఁడనుఁడు. అట్టివారే వేఱొకఁడనుఁడు. అట్లయిన నిఁక 'బుద్ధి'కి, 'ప్రేమ'కు నవినాభావ సంబంధమున్నట్లేకదా. కాని యట్టి యవినాభావసంబంధమొక్క విజ్ఞానవంతునిలోనే జూడనగునని తలంచవలెను. మనుష్యులలో నీ రెండు ప్రవృత్తులే గోరంత కలసియున్నను వారిని విజ్ఞానవంతులని వ్యవహరించుచుందుము. వారి యా విజ్ఞానలేశమును లోకములో ప్రస్తుతము 'లౌక్య' మన్న పేరుతో 'చలామణి' యగుచున్నది. అట్టిదానిని విజ్ఞానలేశమనుఁడు లేక లౌక్యమనుఁడు. అందలి యదార్థమును గ్రహించినఁ జాలును.

'ప్రేమలేకుండా బుద్ధియుంటుందా? బుద్ధిలేకుండా ప్రేమయుంటుందా?' యన్న ప్రశ్నకు పైనిచెప్పినదే సరియైన సమాధానము. ప్రేమలేకుండ బుద్ధియుండవచ్చును. ఉ|| రకరకముల మారణయంత్రములను దనధీశక్తిచేఁ దయారుచేయు బుద్ధిమంతుఁడు. ఆ హృదయములో ప్రేమలేదనియేఁ జెప్పవచ్చును. ఒకవేళనే గోరంత యున్నను నయ్యది కొండంతబుద్ధిచే నణఁగఁద్రొక్కఁబడి దానిసహజ కోమలత్వమునుఁ గోల్పోవును; ప్రత్యేక వ్యక్తిత్వమును మఱచిపోవును. ఆవిధముగనే బుద్ధిలేకుండ ప్రేమ యుండవచ్చును. ఉ|| మాతృప్రేమచేఁగన్న బిడ్డల కజీర్ణముచేయునంతవఱకు నవివేకపు 'తిండి'చే వారి పొట్టల నిండించు వెఱ్ఱితల్లి. ఇచ్చట నా మాతృదేవికేవిధమైన బుద్ధిలేదని యూహింపవచ్చునా? కాదు. ఇచ్చట సామాన్యమైన బుద్ధియున్నను నయ్యదసమానమైన మాతృప్రేమకు లొంగి భంగపడిపోయినదని గ్రహించవలెను.

ఇఁక డిశంబరు సంచికలో శ్రీ సంపాదకులు వ్రాసిన "బుద్ధి పర్వతమువంటిది ప్రేమ సముద్రమువంటిది ప్రేమ అను క్షీరసాగరములో బుద్ధి అను మేరుపర్వతము తేలుచుండును. బుద్ధి సూర్యునివంటిది అనగా జ్ఞానమను వెలుంగుతో వెలయుచుండు శక్తి శక్తిప్రకాశము. ప్రేమ చంద్రునివంటిది. ఆనందమును ఆహ్లాదకరమగు కాంతితో నిండియుండును" అను వాక్యమునందలి అర్థమేమి?

పైవాక్యమును వ్యాఖ్యానముచేయక విడచినందులకు నేను నిజముగఁ జింతిల్లుచున్నాను. 'ప్రమాదోధీమతామపి' యని కదా యార్యోక్తి. బుద్ధిమంతులకే ప్రమాదములు తటస్థించుట సహజమైనప్పుడు నావంటి సామాన్యునివిషయము వేఱుగ నుడువనక్కఱలేదు. ఇప్పుడవకాశము గలుగుటచే నాకు తోఁచినరీతి వ్రాసెదను.

బుద్ధి పర్వతమువంటిదనుటలో సందేహమిసుమంతయునులేదు. ఏలననఁగ బుద్ధి పర్వతమువలె నచంచలమైనదగుటచేతనే. పరిపక్వముఁజెందిన బుద్ధి స్థిరత్వములో పర్వతసదృశమే! "కలంచునే సతులమాయల్ ధీరచిత్తంబులన్" అల్లసానివాని యప్పటిమాట. ఇచ్చట ధీరశబ్దమునకు 'బుద్ధియనికదా యర్థముఁ జెప్పుకొనవలయును. అట్టి బుద్ధిమంతులు సతులమాయలకు చలింపరనియేకదా భావము. కాఁబట్టి బుద్ధిని పర్వతముతో నుపమించుటయేమేలు. ఉ|| బుద్ధుఁడు తన పైదలియందలి ప్రణయమును, తొలిచూలి కాన్పునందలి ముద్దును మఱచి, నిర్వాణపదము నందుకొనుట కేకాయెకి నర్ధరాత్రమున నేకాకియై పాదచారియై నిశ్చలుఁడై పయనించిన యెకిమీడు. ఇది ధీరత్వము. అటులనే నర్ధరాత్రమున పండు రేయెండలో హాయిగఁ బవ్వళించి నిండు జవ్వనముచే నిగనిగ మెఱసిపోవు నిజకాంతచే హృదయము పండిపోవునట్లు శుశ్రూషఁ జేయించుకొనుచు నామెను మఱచి, పరమాత్మతోఁ దనయాత్మనైక్యముఁజేసి తన్మయుఁడై యాత్మపారవశ్యము ననుభవించి

నిశ్చలసమాధినిఁ బ్రవేశించి యసమాన ప్రజ్ఞాధురంధరత్వముచే దుర్నిరీక్ష్యముగఁ బ్రకాశించిన విజ్ఞానమూర్తి, శ్రీరామకృష్ణుఁడు. ఇది ధీరత్వము. అశోకుని ప్రజ్ఞావిశేషము శ్రీ హర్షునిధిషణామాహాత్మ్యము, రామతీర్థుని ధీచాతుర్యము, వివేకానందుని యసమానశేముషీవిభవము, తిలక్ మహాశయుని బుద్ధివిశారదత్వము ధీరత్వమున కుపమానములు. భూధరమువలె నచంచలమైనదగుటచేతనే బుద్ధిని శ్రీ సంపాదకులు పర్వతముతో నుపమించిరి.

ఇఁక ప్రేమ సముద్రమువంటిదే. ఏలన ప్రేమకు వైశాల్యము హెచ్చు. సముద్రతరంగములవలె ప్రేమ పొంగి పొరలుచుండును. జలాధికముచే నేపిల్లగాలి దుడుకుఁదనమునకైనను సముద్రతరంగము లల్లకల్లోలమగుచుండు టెల్లరకు విశదమే. అట్టియెడ తుపాను చెలరేఁగినప్పుడుగాని పున్నమచంద్రునిఁ జూచినప్పుడుగాని, భూమి కంపించినప్పుడుగాని నిఁక నా సంద్రములో నుద్భవించిన సుత్తుంగతరంగముల నరికట్ట నెవరికి సాధ్యమగును. అటులనే ప్రేమతరంగములుకూడ నేకొలఁది గికురింతకైన నల్లకల్లోలమగుచుండుననిన, నిఁక హృదయములో ప్రణయము రేకెత్తినప్పుడుగాని, ప్రేయసుని ముఖచంద్రదర్శన భాగ్య మబ్బినప్పుడుగాని, సంసారములో ప్రణయకోపము నభినయించినప్పుడుగాని, ప్రేమతరంగము లుత్తుంగములై నిరోధింప నలవికానివై యుండుననుట కరతలామలకము కదా! ప్రేమ సముద్రమువలె నగాధమైనది. అందలి కెరటములు పైకెగయుచుఁ గ్రిందఁబడి యగాధ జలధిలో క్రమందుచుండును. ఉ॥ శైశవావస్థలోఁ దలిదండ్రులయందలి భక్తి యౌవనములోఁ బ్రియునిమీఁద ప్రణయముగ, కౌమారములో నిజసంతానముమీఁద వాత్సల్యముగ వార్ధక్యములోఁ బరమాత్మ దేవునిమీఁద దివ్యప్రేమగఁ బ్రవహించుచుండును. కనుకనే ప్రేమ, ప్రవాహముతో నుద్దియని పెద్దలందరు. సకల ప్రవాహముల కాశ్రయము సముద్రము. ప్రేమ పుక్కిలింతలైనపు డద్దానిని సముద్రముతోఁ బోల్చుటయే సమంజసము. కనుకనే శ్రీ సంపాదకులు ప్రేమను సముద్రముతో నుపమించిరి.

ఇఁక మేరుపర్వతము, శ్రేష్ఠవాచకము; క్షీరసముద్రమునునట్లే—అనఁగ, పర్వతములలో మేరువు శ్రేష్ఠమైనది గనుక నట్టి మేరుపర్వతముతో ధీరత్వము నుపమించుట. అట్లే సాగరములలో క్షీరసాగర ముత్కృష్టమైనది గనుక నట్టి పాలసంద్రముతో ప్రేమ నుపమించిరని గ్రహించవలెను. తేఁలుచుండుననుట కేవలము భావములుక్కిరిబిక్కిరియై తొట్రుబాటుతో నొకదాని నింకొకటి ముందుకుఁ ద్రోయుచుండుటవలన వ్రాసినమాటయే గాని యచ్చట తేలుట యన నీటిలో నౌకవలె తేలుటఁగాదని గ్రహించవలెను. బుద్ధి పర్వతమువలె సమున్నతము.

బుద్ధి సూర్యునివంటిదే. ఏలనన బుద్ధిలోఁ బ్రకాశమానమున్నది గనుక ప్రకాశించు గుణమెందుండిన నందు కొంత తైక్ష్ణ్యము నిశితత్వము సహజముగ నుండును. ఉ॥ ఇనబింబము. కనుకనే బుద్ధిని సూర్యునితోఁ బోల్చి యుండవచ్చును. ఇఁక ప్రేమ చంద్రునివంటిదే. కారణము హృదయమే ప్రేమకునికిపట్టు గనుక. హృదయము మృదుమధురముగ నుండునని వ్రాయుట చర్వితచర్వణము. ఇచ్చట బుద్ధిలోవలె తైక్ష్ణ్యముండదు. వాఁడియుండదు. చల్లని చంద్రికలను బ్రసరించుటయే దానికి సహజలక్షణము నిసర్గవర్తనమునైయున్నది. నిండు చంద్రుఁడేవిధమున మనసు కాహ్లాదమునిచ్చునో యట్లే ప్రేమమానసోల్లాస మొసంగును. కనుకనే సితద్యుతితోఁ బ్రేమను పోల్చియుందురు.

*From,*

## Mr. GRANDHI VENKATARAMAIAH, B.A., B.L.,

*To,*

*The Proprietor,*

"GRIHALAKSHMI" MADRAS.

*Sir,*

The success and popularity of any Magazine or Journal depends not upon the matter in so many pages but upon the quality and manner in which it represents the ideals of humanity and the spirit of the Age. Undoubtedly its success will be enhanced by the proper and intelligent selection and publication by its Editor of such articles which inculcate the truths of humanity for the uplift and enlightenment of society at large.

'Grihalakshmi' is the only Telugu Ladies' 'Magazine' which has given a definite shape to the "*Ideals of Womanhood*" and consequently attained popularity throughout India, especially in Andhra Desa. In connection with the 13th birthday celebration of "Grihalakshmi" I wish the journal a long life and success to the present Editor whose services to Telugu Language in general and to "Grihalakshmi" in particular are invaluable.

I once again wish for the wide circulation of this Magazine which is of immense use for the elevation of Womanhood in India.

MADRAS,
*14th Feb. 1940.*

*Yours sincerely,*
(Sd.) GRANDHI VENKATARAMAIAH.

## ' గృహలక్ష్మి ' 13-వ జన్మదినోత్సవ సందర్భమున శ్రీ గ్రంధి వెంకటరామయ్యా బి. యే. బి. యల్. గారి ఆశీస్సు సందేశము

కాలోచితముగ ప్రజాహృదయమునందు ప్రజ్వలించు భావపుంజమును బాగుగ వెలయించుచు, మానవజీవితాదర్శములను మనోరంజకముగ నే పత్రిక చిత్రింపగలుగునో అయ్యది జయమును ప్రజాభిమానమును బడయగలదు; కాని పెక్కు పుటలను మిక్కుటముగ తుక్కువిషయములతో నింపుటచే నిక్కువమగు మక్కువను ప్రజాహృదయములో నే పత్రికయు నెక్కొనజేయజాలదు.

మానవహృదయములో మెరయుచుండు సత్యార్థములను సందీపింపజేసి, సాంఘికాభివృద్ధికి సహాయపడగల విజ్ఞానవికాసమునొసంగు వ్యాసములను కుశాగ్రబుద్ధితో సంపాదకు డెంచుకొని నయ్యవి ప్రచురించినపుడే పత్రిక ప్రజావిశ్వాసమును వశపరచుకొని, విజయముతో వర్ధిల్లగలదు.

స్త్రీధర్మాదర్శములకు రూపరేఖావిలాసములేర్పరచిన స్త్రీల పత్రిక ' గృహలక్ష్మి ' యొక్కటియే గావున నియ్యది హిందూదేశమంతటిలోను, ముఖ్యముగ నాంధ్రావనిలో నధిక పేరుప్రతిష్ఠలను పొందగల్గినది.

' గృహలక్ష్మి ' 13-వ జన్మదినోత్సవ సందర్భమున నీ పత్రికాకుమారి యొక్క చిరాయురభివృద్ధిని కోరుచు, ప్రస్తుత సంపాదకోద్యోగిచే ఆంధ్ర భాషకును, ప్రత్యేకముగ ' గృహలక్ష్మి 'పత్రికకును ఒనరింపబడుచున్న అమూల్యసేవల నభినందించుచున్నాను. భారతరమణీమణుల యభ్యున్నతి కెంతయు తోడ్పడుచున్న ఈ పత్రికయొక్క విశేషవ్యాప్తిత్వము నెక్కుడుగ నభిలషించుచున్నాను.- (ప్రక్కపుటయందలి ఆంగ్లములోని జాబున కనువాదము.)

## *Matru Mandali, Mysore.*

### PEDDADA KAMESWARAMMA GARU, B.A.,

"We have been regularly getting 'Grihalakshmi' and it is responsible for creating a taste for learning telugu among a number of Canarese Ladies. So indirectly the Journal is rendering a great service to Telugu."

"మీ గృహలక్ష్మి పత్రిక కన్నడ స్త్రీలలోగూడ తెలుగు భాషయందభిరుచినిగలిగించి ఆంధ్రభాషా వ్యాప్తి కపారమగుసేవ నొనరించుచున్నది." ( శ్రీ పెద్దాడ కామేశ్వరమ్మ బి.ఏ. )

# భక్తి

పాయనిభక్తిచేఁ బలుబాధలనుజెంది ప్రహ్లాదుఁడతులిత పదముఁజెందె
సకలకష్టములోర్చి సక్కుభక్తినిఁగాదె సాయుజ్యసౌఖ్యంబు సరగఁబొందె
నిశ్చలభక్తిఁగా నిలతపస్సొనరించి ధృవకుమారుఁడుఘన ధృవక్షితొందె
సతతనారాయణ స్మరణంబుననుగాదె నారదుండమరమాన్యై చెలంగె

మహాదేవునందలి మహితభక్తిచెగాదె అలమృకండునిసూనుఁ డాయువందె
శ్రీరామకీర్తనల్ జెలువొందగీర్తించి త్యాగరాజయ్యెను భాగవతుఁడు
రామనామజపంబు నీమంబుగనుజేసి వాల్మీకితొలిజన్మ వదలిపోయె
శ్రీకృష్ణదర్శన సేవానురక్తిచే విదురార్జునాక్రూర విమలయశులు

గోపగోపికద్రౌపది గొప్పసతులు
ఘనకుచేలాదిభక్తులు మనమునందు
కృష్ణపరమాత్మభక్తిని కుదురుపరచి
పూజ్యులై ముక్తులై భువిఁ బుణ్యులైరి.

ఎన్నివిద్యలనేర్చివే రెన్నివిన్న
ఫలితమిసుమంతలేదిల భక్తిలేక
తర్కవేదాంత తత్వముల్ తరచిచూడ
కాలయాపనలౌగాని కనరుముక్తి.

కమలగర్భునిఁగన్న కాంచనాంబరుసేవ మానకసేయుడీ మనుజులార !
ఆగమవేద్యుని నతభక్తిపూజలు మానకసేయుడీ మనుజులార !
శరణాగతత్సర శౌరినామభజన మానకసేయుడీ మనుజులార !
దినకరువంశాబ్ధి ఘనరత్నకీర్తనల్ మానకసేయుడీ మనుజులార !

రామశ్రీరామ రఘురామ రామయనుచు
రంగశ్రీరంగ పండరీ రంగయనుచు
కృష్ణ శ్రీకృష్ణ రాధికా కృష్ణ యనుచు
మానకనుచింతసేయుడీ మనుజులార !

—శ్రీ ఆచంట సత్యవతమ్మ.

# ద్రవ్యనిర్వాణం

"వసంత"

ఎంతోముచ్చటపడి మొన్ననేకొన్నానండీ, ముద్దులుమూటకట్టుతున్న గ్లాసు, నిష్కారణంగా పగులకొట్టేరు!

నీవు గ్లాసుఇస్తున్నావుకాని అది పగిలిపోతుంది సుమా అని ముందుగాచెప్పనే చెప్పేను. నేనేదో పరిహాసంచేస్తున్నట్లు భావించావు.

మరుగుచున్న వేడినీరు గాజుగ్లాసులో పోసినప్పుడు అది బద్దలయితే బాగుందికాని, మధ్యాహ్నం మీరు తెచ్చిన ఆచల్లనినీరు—

కాదు. అదినీరుకాదు. మనంపీల్చేగాలినే అతిచల్లగా చేసినపుడు ఆవిరి నీరుగా మారినట్లు అదిద్రవంగామారుతుంది. ద్రవించినగాలి కాబట్టి దానిని 'ద్రవపవనం' అంటారు.

అదే ఆద్రవపవనం పోసినంతమాత్రాన్న గ్లాసు ఎలా పగులుతుందనుకొంటానండీ?

వేడినీరుపోస్తే గాజుపాత్ర ఎందుకుభిన్నమగునో అక్కడ కింక తెలసినట్లు!

ఎన్నోసార్లు ఉడుకునీరు వేక్యూమ్‌ఫ్లాస్కులో పోసి బద్దలుకొట్టేను కదండీ!

అయితే అవెందుకు పగులుచున్నవో తెలిసిందా? ద్రవపవనంకూడా సులభంగా లభ్యమైతే మరికొన్నిఫ్లాస్కులు ముక్కలు చేయడానికిమాత్రం అర్హత లేదూ?

ఆమాత్రంజ్ఞానముంటే ఇన్నిమాటలు మీచేత అనిపించుకొంటానండీ? ఆమాత్రం జ్ఞానమున్నా, ఈపుట్టుకలేకపోయినా మీవలెనే హాయిగా ఉద్యోగంచేసి జీవనోపాయం చూసికొనేదాన్ని.

ఉద్యోగంకొఱకే జ్ఞానార్జనమన్న భావం పిశాచమట్లు ఆవహించి, మనలనుపిప్పిచేసి రసహీనులనుగాచేస్తున్నది. సుఖజీవనానికి, ఆత్మశాంతికి, జన్మతరింపచేసికొనుటకు జ్ఞానం అత్యంతావశ్యకమన్న సత్యం మనము మరచిపోతున్నాము. మానసికవికాసం స్త్రీపురుషుల కందరకు సదృశంగాకావలసినదే. 'విద్యాహీనానశోభంతే నిర్గంధా ఇవకింశుకాః' అని ఎంతరసవత్తరంగా అన్నారోచూడు.

మమ్మల్ని నిర్గంధకుసుమములుగా తయారుచేసినదిమీరే కదండీ! బడికిపంపి చదువునేర్పిస్తే మేముకాదన్నామా, రాదన్నామా? 'ముదితల్ నేర్వఁగరాని విద్యకలదే ముద్దారనేర్పించినన్?'

నీవాదమూహింపలేకపోలేదు అయితే, కళాశాలకుపోయి నేర్చుకొన్నదే విద్యకాని యోగ్యమైనగృహలక్ష్మివలె గృహకృత్యములు నిర్వర్తించుకొనుచు, ఇంట్లోచదువుకొన్నది సార్థకంకాదనా ? నేటివిద్యా విధానమెంతమాత్రము జ్ఞానప్రదాయకముకాదు. ఉదరపోషణకు నాలుగురూకలు లభింపచేయుటకన్న నేటివిద్యకు వేరొకప్రయోజనములేదు. పట్టభద్రులైనవారుకూడ కళాశాలవిడిచి ప్రాపంచకరంగంలో ప్రవేశించినతరువాతనే యథార్థమగు మానసికవికాసము పొందుచున్నట్లు గ్రహిస్తున్నారు. దానికేమి మీకాఅవకాశంలేక పోయిందికదా అని ఊరుకోకుండా ఇంట్లోనేకాస్త కృషిచేసికోరాదు ?

ఇంట్లోకృషా ? అదిఅసాధ్యమనలేనుగాని, ఇంట్లో విద్యాభ్యాసం సరళంగా ఎలాగు కొనసాగుతుందండీ ?

విద్యాభ్యాసంగాదు, మీరుచేయువలసినది జ్ఞానార్జనము. దానికై బడిలో పద్ధతి ప్రకారం ఏర్పాటుగా పాఠాలుచదివినట్లు మీరుచదువనక్కరలేదు. జీవయాత్రలో దినదినం పుంఖానుపుంఖాలుగా వాటిల్లుచుండు విషయాలను అవకాశమైనపుడల్లా విమర్శనాదృష్టితో సమీక్షించి వాటివైజ్ఞానిక వివక్షకనుగొన ప్రయత్నిస్తేచాలును; ముక్కాకలు తీరిన పండితులుకాగలరు. ఎంతస్వల్పవిషయమైనా మహత్తరసత్యములు బుద్ధిగోచరము చేయవచ్చును. సామాన్యసంఘట్టనాలలో అసామాన్యఆదేశాలు కనుగొనగలజ్ఞానమే సత్యమైనజ్ఞానము. ఎంతస్వల్పవిషయమైనా మన మేధృక్పథంలో పరిశీలింతుమో తదనుగుణ్యంగా మనకందలి విశిష్టార్థములు ద్యోతించుచుండును.

చెట్టు పట్టుతప్పి భూపతనమొందుచున్న పరిణతఫలంగాంచిన న్యూటను (Newton) ప్రధానమును సార్వత్రికమును అగు గురుత్వాకర్షణ సూత్రంకనుగొన్నాడని ప్రతీతి. ఆరముగ్గినపండ్లు అనాదిగచెట్లనుండి రాలుచుండుటలేదూ ? వాటినెందరుచూడలేదు ? అట్టి పతనఫలదృశ్యము న్యూటనుకొక్కనికే ఆగొప్పసూత్ర రహస్యము వెల్లడించుటేల ? సలసలమరుగుతున్న నీటిపాత్రపై పెట్టినమూత ఆవిరివిరివిరిగెంతుట ప్రాచీనమానవులు చూడలేదూ ? ఆస్వల్పవిషయం ఆవిరియంత్ర నిర్మాణభావమును జేమ్సువాట్ (Watt) హృదయమ్మందే ఉత్పన్నంచేయనేల ? ఒకటేకారణము. ఆధీమంతులు చూచినవిషయాలను సామాన్యులవలె చూచినట్లేమరచిపోక అట్లవిసంభవించుటకు కారణమేమైయుండునో వితర్కింపపూనుకొన్నారు. తత్ఫలితంగా గొప్పసిద్ధాంతాలుకనుగొన్నారు; వాటినినిత్య వ్యవహారంలోప్రయోగించి జనోపయోగమగు యంత్రాలునిర్మించి జీవితసౌఖ్యం పెంపొందించేరు.

ఏమైతేనేమి మేముబడిలో విద్యాభ్యాసంచేయుట మీకురుచించదు !

రుచించ కేమీ? అమ్మాయినిబడికిపంపుట లేదూ? జ్ఞానార్జనం ఇంట్లో నేచేయు విధానంకూడ కలదని చెప్పేను. ఇప్పుడునీవు కళాశాలకుపోయి చదువుటకష్టంగదా! నీవంటి వారెందరో ఆసక్తిపరులున్నారు. విద్యాపఠనం అసాధ్యమని అట్టేఉండకుండా వారు నిత్య జీవితంలో జ్ఞానంసంపాదించు మార్గంగలదనిసూచించేను.

అయితే, ఈ 'పగిలినగ్లాసు' విషయంగాతీసికొని దీనివిజ్ఞానం చెప్పగలరా?

తప్పక. అతి వేడిద్రవంగాని, ఎంతో చల్లనిద్రవంగాని పోస్తే గాజుపాత్ర పగులుతుంది. కానిరాగి, వెండి, బంగారము మొదలగు లోహపాత్రలు ముక్కలుకావుకదా? దానికి కారణం పాత్రయొక్క ద్రవ్యంలోనుంది. వేడిమికాని, చల్లదనంగాని లోహములలో త్వరగా ప్రవహిస్తవి. వెండికప్పులో వేడికాఫీపోయగానే లోనుండిపైభాగానికి ఆవేడివెంటనే వ్యాపిస్తుంది. గాజు, మట్టిపాత్రలతో అట్లుకాదు. ఎంతవేడికాఫీ గాజుకప్పులోపోసినా కప్పును పెదవితోతాకగలము. అంత వేడిమిపైకిరాలేదు. వేడిమికి అవిమంచివాహకములు కావు. లోభాగంకాఫీఅంత వేడిగానున్నప్పటికి, పైభాగం ఒక్కింతవెచ్చగామాత్రమే ఉంటుంది.

వేడిమికి పదార్థాలు పరిమాణంలో సాధారణంగా పెరుగుతవి. ఉడుకు నీరుపోసిన గాజు గ్లాసుయొక్క అంతర్భాగం ఆ హెచ్చు వేడిమికి అధికంగా ఉరడిస్తుంది; తక్కువ వేడిమిగల బహిర్భాగం తక్కువగానే పెరుగుతుంది. ఒక దళసరిగల గాజులో విశాలమైన ఒకభాగం అధికంగా పెరగడం, దాని ఎదుటిభాగం స్వల్పంగా పెరగడం కారణంగా ఆగాజు పాత్ర పగులువేసి ముక్కలౌతుంది. ఇట్టి విషమావస్థ తటస్థంగాని లోహపాత్రలకు అట్టి ప్రమాదంలేదు.

ఈ సంగతి పూర్వమే చెప్పిఉంటే అరడజను గ్లాసుల దాకా బ్రద్దలుచేసేవాన్ని కాదుకదండీ! ఉపయోగకరమైన ఇట్టి విషయాలు మాకుగా మేమర్థించి నేర్చుకొనకుండుట మాపొరపాటే; కాని, మీ అంతటమీరే అధ్యాపకత్వంవహించి నేర్పకపోవుట మీది మరీ పొరపాటు . గాలి నీరేవిధంగా అయినదండీ?

నీరంటే త్రాగేనీరుకాదు. వాయువుగాఉన్న గాలి ద్రవం అయింది. నీరుఘనీభవించి మంచు అగుచున్నదికదా. అట్లే గాలి ద్రవిస్తుంది.

అంటే?

విశ్వంలోనున్న ద్రవ్యమంతా మూడురూపములలోనుంది. ఘనరూపము-రాయి, మంచుగడ్డ; ద్రవరూపము-పాదరసము, నీరు; వాయురూపము-గాలి, ఆవిరి; ఏ పదార్థమైనను

ఒక కాలమందు ఏ రూపంలో నుండగలవో నిర్ణయించేవి రెండు విశేషణములు: తాపక్రమం (Temperature) పీడనంలేక ఒత్తిడి (Pressure) అందులో తాపక్రమం ప్రధానమైనది. ఘనరూపంలోనున్న పదార్థాన్ని ఉష్ణీకరించిన కొద్దీ సామాన్యంగా అది తొలుత ద్రవించి తరువాత వాయువుగా మారుతుంది. మంచు సామాన్య తాపక్రమంలో గడ్డవలె ఉండలేదు. ద్రవించి నీరు అగును. అందుచేతనే నీరు పుష్కలంగా లభిస్తున్నది. నెయ్యి, మైనం మొదలగు పదార్థాలు కొలదివేడిమికే ద్రవిస్తవి. శీతకాలంలో వడ్డిస్తూండగానే నెయ్యి గడ్డకట్టుట మన కనుభవమే. సీసం, అల్యూమినియం, వెండి మొదలగు లోహములు కొన్ని వందల అంశలతాపక్రమాన్ని కాని ద్రవించవు. ద్రవములు వాయువగుటకు అంతకధిక వేడిమి కావలెను. నీరు 100 డిగ్రీలకే మరుగుతుంది. పాదరసం 350 డిగ్రీలకు ద్రవించిన లోహములు 2000 డిగ్రీలపై బడితేగాని వాయువుకావు.

పదార్థాలలో అవస్థాభేదములను వేడిమి ఎట్లు కలిగించగలదండీ ?

ఆ సంబంధం తెలిసికొనుటకు ద్రవ్యంయొక్క లక్షణాలతో, ద్రవ్య నిర్మాణంతో కొద్దిగా పరిచయంజేసికోవాలి. జగత్తులోనున్న ద్రవ్యమంతా 92 మూల పదార్థాలతో ఏర్పడుచున్నదని వైజ్ఞానికులు కనుగొన్నారు. భూమిలోనేకాదు, గ్రహాలలోకాదు, నక్షత్రాలలోకాదు, యంత్రసాహాయ్యంతో దృగ్గోచరమైన ద్రవ్యసముచ్చయమంతటిలోను 92 మూలపదార్థాలను మించిన వేరొక మూలపదార్థం ఇంతవరకు బయల్పడలేదు. వీటి సమ్మేళనముతోనే తదితర యోగములు (Compounds) ఏర్పడుచున్నవి. ఇక వీటి లక్షణాలు సంగ్రహంగా విచారిద్దాము.

ఏ రూపంలోనున్నా ద్రవ్యానికి భారం (Weight) పరిమాణం (Volume) ఉండి తీరుతవి. ఘన పదార్థాలకి నియతాకారం ఉన్నది. ఎంత ఒత్తిడికైనా అవి సంకోచించవు. వాటి పరిమాణంమారదు. ద్రవములకు నియతాకారంలేదు. ఏపాత్రలోనుంటే దాని ఆకారమే వహిస్తవి. పాత్రలో పరిమాణంమారదు. కాని, ఘనపదార్థములంత ఒత్తిడి భరించలేవు. వాయువులకు ఆకారమూలేదు, పరిమాణమూలేదు. కొంతవాయువు ఎంత పరిమాణంగల ఆవరణములోనైనా పూర్తిగా వ్యాపించి స్థలమంతా ఆక్రమిస్తవి. ఒత్తిడి నేమాత్రము భరించలేవు.

ద్రవములు వాటిమట్టం కనుగొనునని సిద్ధాంతము. ద్రవానికి ప్రవహించేగుణము, గాలికి వీచేగుణము, శక్తికి ప్రసరించేగుణము స్వతస్సిద్ధము. వాటికి నియమం, పద్ధతిలేక పోలేదు. మెరక ప్రదేశంనుండి పల్లపు ప్రదేశానికే ద్రవంపారుతుంది. అతిపీడన స్థలంనుండి స్వల్పపీడన స్థలానికే వాయువు వీస్తుంది.

# శ్రీ రమణ గురు స్తవము

నిరుపమ, నిస్సంగ, నిష్క్రియా, నంత
నిష్కళంక, విమల, నిర్వికార, ఘన
నిత్య, నిరంజన, నిర్వికల్ప, పర
బ్రహ్మమే-తా స్వరూపమ్మవతరించి
నట్టి శ్రీ జగద్గురుఁడా! ప్రణామమ్ము!

౨

ఆకాశసదృశ, సత్యము, నిరాలంబ
మమలము, నిశ్శబ్ద, మత్యుచ్చ, మఖిల
మతిపూర్ణ మాద్యంతమానరహితము
పూజ్య మార్యావర్తమున మహాఋషులు
పొంది తరించిన పూతమౌపదము
స్థిరము, జ్ఞాతృ, జ్ఞ, జ్ఞేయశూన్యమగు
శుద్ధ బ్రహ్మజ్ఞానజ్యోతి! మదీయ
సద్గురుమూర్తికి! సతము నమోస్తు!

౩

సంతతనిశ్చల సహజసమాధి
నిష్ఠాగరిష్ఠులై, నిత్యముక్తులయి
భౌతికవాసనల్ వాసి సతంబు
ఆత్మోపరతులై, దయామయులునయి
సన్న్యాసమదిలోక సంగ్రహార్థముగ
భవదాశ్రితులనెల్ల భవసాగరమును
తరియింపఁబూను శుద్ధజ్ఞానమూర్తి!
మద్గురుస్వామి! నమస్కారము! ప్రభు!

౪

ఎన్నిజన్మములుపోయెనో! యగణ్యతను,
నేటికి మీపాద నీరజ దివ్య
సేవా పరమభాగ్యసిద్ధి నందితిని,
చిరకృత సుకృతవిశేషముచేత
ఈజన్మ, మీదేహ, మీసేవ యింక
ఈ సర్వమును భవదీయకైంకర్య
మున వినియోగించి నను, ధన్యుఁజేయ
ప్రార్థింతు గురుదేవ! ప్రాంజలినగుచు.

౫

ఎవని కరుణచేత నేగె సజ్ఞాన,
మెవని సన్నిధి ప్రసాదించెను ముక్తి,
ఎవ్వాని సహచర్య మీభవబంధ
తాపత్రయములూడ్చి దరిజూపి బ్రోచె,
ఎవని ధ్యానామృతార్ణవ వీచి గంటి
నిత్య చిన్మయమహా నిర్వాణ పీఠి
ఏవాని పాదాబ్జ సేవానిరస్త
పరమభాగ్యమున జీవన్ముక్తిపదము
నందునా సచ్చిదానందరస ప
రబ్రహ్మమునకు మహానుభావునకు
నాపూజ్య రమణదేవా! ప్రణామమ్ము!

౬

దివ్యసంపదలైన దీనత్వమైన
మహనీయమైన సామాన్యమేయైన
సంసృతిజిక్కిన జ్ఞానినై మనిన
నాకేల లక్ష్యమ్ము! నాకన్యమేల!
ప్రభు! భవత్సేవాపరత్వమ్ముగాక!

౭

దరిఁజేర్చినావో! ఏకరుణావిభూతి
విడువకుమయ్య! ఏవేళలఁగాని
అవ్యాజ కృపఁబూని యాదరింపుమ్మ

అన్యథానాస్తి శరణ్యంత్వమేవ,
మాంపాహి సర్వము, మమదేవదేవ!

౮

అంతులేనట్టి మాయాకల్పిత బహు
జన్మ, జరా, మృత్యు, సంసార, క్లేశ
తాపజాలమునుండి కాపాడి మనిచి
ఆత్మసందర్శన మందిచ్చినట్టి
పరమపావనమూర్తి! భవదీయ దివ్య
పాదసేవికనయివరగి తత్పాద
జలజ పరాగలేశము సదా శిరము
నను(దాల్చు భాగ్యమ్మున ననుగ్రహించు
భవవిదారణ గురువర్య! నమోస్తు!

౯

ఏమహాపుణ్యమో, ఏయోగబలమొ,
ఏవరమహిమమో ఏమిభాగ్యమ్మొ,
ఇనుమయస్కాంతమ్ము నెనసినకరణి
నీపాదముల(జేరి నేధన్యనైతి!

౧౦

అసమానదుర్లభ మవ్యయానంద
బ్రహ్మసాక్షాత్కారపదము ప్రాప్తించి
ఎదితెలిసినలేదో! ఇకనన్యమెరుగ
నట్టి సజ్ఞానము నతికృప నొస(గి
సర్వోత్తమగతి ప్రసాదించి బ్రోచు
మా జగత్పూజ్యదేవా ప్రణామమ్ము!

—శ్రీ పొణకా కనకమ్మ.

## శ్రీ రమణలీల (షష్టిపూర్త్యుత్సవోపహారము)

రచయిత :-కృష్ణకొండిన్యు(డు, ప్రచురణకర్త : శ్రీ నిరంజనానందస్వామి. సర్వాధికారి, శ్రీ రమణాశ్రమము, తిరువణ్ణామలై. వెల :-రూ 1-8-0. ఇందులో 500 పేజీలును వివిధపటములును గలవు.

మూర్తీభవించిన ఆత్మవిజ్ఞానమేయనబరగి శ్రీ సచ్చిదానందపరబ్రహ్మ సాక్షాత్కారమును చేసికొని సిద్ధపురుషులలో సుప్రసిద్ధుడై భువి విలసిల్లుచు సంతత శ్రీ అరుణాచలేశ్వర సాన్నిధ్యశాంతిసుఖాస్పదుడై, ఆశ్రితులకాధ్యాత్మికజ్ఞానప్రదుడై అక్షీణమోక్షలక్ష్మీసింహాసనారూఢుడై అవధూతలకు నాదర్శమార్గదర్శకుడై అంచిత అవతారమూర్తి వైభవోపేతుడై, జీవన్ముక్తులలో నగ్రగణ్యుడై దివ్యమహిమతో తేజరిల్లుచున్న శ్రీ రమణమహర్షి భారత ఋషిపుంగవులలో ప్రఖ్యాతపురుషుడైన పుణ్యస్వరూపుడనుటకు సందియములేదు.

శ్రీ రమణమహర్షి తపోధనసంపదను వెలయించుచున్న నీ సద్గ్రంథములో (1) మానుషలీలాఖండము (2) యోగలీలాఖండము (3) అచలతాండవఖండము (4) ఆశ్రమవాసఖండము (5) వర్ణనాఖండము (6) అవతారఖండమునను, ఆరుభాగములున్నవి.

ఈ యారుఖండములును వివిధప్రకరణములుగ విభజింపబడినవి. శ్రీ మహర్షి యొక్క జీవితము నామూలాగ్రముగ దెల్పుచు, నందలి అద్భుత లీలలను జ్ఞానప్రబోధకములగు విషయములతో, సవిస్తరముగ వ్రాసి ఈ గ్రంథకుసుమహారమును శ్రీ రమణచిద్విలాససార్వభౌమునకు షష్టిపూర్తిమహోత్సవ కానుకగ సమర్పించిన గ్రంథకర్తజీవితమెంతయు ధన్యవంతము. ఈ పుస్తకముకుతగ్రంథమాలలో నొక దివ్యకుసుమము. (గృ॥ సం॥)

# గృహలక్ష్మి స్వర్ణకంకణ గృహీతలు



శ్రీమతి
కవితిలక పులవర్తి కమలావతీదేవిగారు
1937



చిత్రకళావిశారద
శ్రీమతి
రత్నాల కమలాబాయిగారు
1939



సతి
శ్రీమతి బాలాంత్రపు శేషమ్మగారు
1939

# గృహాలక్ష్మీ జయంతి మహోత్సవము

కవితిలక, కవితావిశారద, విద్వాన్ శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారి

గృహాలక్ష్మీ స్వర్ణకంకణ ప్రదానోపన్యాసము

---

సతీమతల్లులకు, సభాసదులకు, సభాధ్యక్షపదవి నలంకరించిన దుర్గాంబగారికి నతులు నుతులు సమర్పింతు. గృహాలక్ష్మికి జయంబగు. గృహాలక్ష్మీ కంకణ విరాజితులగు నారీమణులకు విజయంబగు. సంగీతసాహిత్యములు రెండును స్త్రీలపాలిటివే! స్త్రీలు పురుషులు గూడ తల్లులచేతఁ బెంచఁబడువారలేకదా! యోగక్షేమములు విచారించవలసినవారు తండ్రులైనను "అడ్డాలనాటినుండి గడ్డాలువచ్చువరకు" చంటిపిల్లల ప్రాయమునుండి జవరాండ్రగువఱకు స్త్రీ పురుషు లిరువురుగూడ తల్లులచేతఁ బెంచఁబడి, సద్గుణములు, సద్బుద్ధులు, సచ్ఛీలములుగలవారగుచున్నారు. కావున స్త్రీరత్నములు జాతినిర్మాణమున గొప్ప బాధ్యతగలవారగుచున్నారు. జాతికి మూలమగు స్త్రీ పురుషుల కుత్పత్తిస్థానము గృహమగుటచే గృహము పవిత్రముగా నుండవలయును. ఆ గృహమున లక్ష్మి గృహిణి. లక్ష్మి అత్తగారయి సంగీతసాహిత్యములుగల సరస్వతిఁ గోడలి నేలుకొనవలసిన యధికారము కలదిగా నుండవలయును.

గృహాలక్ష్మికి, భర్త, అత్తమామలు, గురువులు, పూజ్యులు. శిశువులు, నతిథులు, నభ్యాగతులు, భిక్షుకులు, సన్యాసులు, పేదసాదలు, పోష్యులు. సంగీతసాహిత్యములుపాస్యములు. శీలమలంకారము. ఆచారము ప్రథమధర్మము. సంప్రదాయము రక్షణీయము.

గృహాలక్ష్మి కాంధ్రభాష ద్రవిడభాషయు స్వభాషలు; చెన్నపురి, రాజధాని. రాష్ట్రవిభజనలో తగాదాలుండుగాక. వారు, చెన్నపట్టణమే మాదికాదన్నవో తంజావూరువరకు మేమడుగవలసినవారమగుదుమని యాంధ్రులందురు.

తిరుపతి వేంకటేశ్వరుగన కరవము నేర్పింప ద్రావిడులు పట్టుబట్టినచో, వేంకటేశ్వరునకుఁ, బూరి జగన్నాథునకుగూడ తెలుగు జెప్పఁదెలుగువారు కడంగుదురు. ఆ తగాదాలు, పాలుపంపులు, నవెట్లున్నను సన్నిహితులముగుటఁజేసి సంప్రదాయమొకటియగుటచే, సంగీతమొకటియగుటచే, దేశభాష యెట్లున్నను సంస్కృతమొక్కటె, కళలొక్కటియగుటచే, వేదశాస్త్రములొక్కటియగుటచే, విద్యాదృష్టితో నాంధ్ర ద్రావిడులకు సంపూర్ణ సానుభూతియు, సౌహార్దము నుండవలసియున్నదని మా 'గృహాలక్ష్మి' ప్రతిపాదించుచున్నది.

ఉ. వేదము శాస్త్రముల్ గళలు వేత్తలు తీర్థము సంస్కృతంబు ని
మ్మేదినికిన్ సమంబగుట మేలగు ద్రావిడు లాంధ్రులేకమై
వేదికఁగూడి సత్కళలవృద్ధికినై కృషిసల్పుడేటి క్షే
భేదము వాదముల్ శ్వపచవృత్తికినై మది ఖేదమక్కటా!

ఉ. వాదము భేదముల్ మఱచి పండితులెల్లరు కర్మభూమిలో
మోదముతో స్వధర్మమును ముఖ్యముగా నిడికొంచు మించి ని
ష్ఖేదపదంబు గాంచుటయె కీర్తికరంబగు. మున్ను పెద్దలా
మాదిరి భారతావనికి మంగళముల్ సమకూర్చి రన్నిటన్.

కేసరిగారికి మాకు సింహపురము (నెల్లూరు) స్వస్థలము. చెన్నపురము వ్యవహార స్థానమగుటచే కేసరిగారి గృహలక్ష్మి మందిరమున నింటి యాడపడుచుదనము వహించి సతీమణులకు సజ్జనులకు స్వాగతంబొసంగు నధికారము సహజముగా గలిగియున్నాను. అది నా భాగ్యమని సంతసింతును.

ఆంధ్ర ద్రావిడసంబంధము చిరకాలమునుండి వచ్చుచున్నది. "మృచ్ఛిలిగే హేంబిర ద్రావిడీ పరిచితిన్ జెండాడు చందంబునన్" గృహలక్ష్మి ద్రవిడాంగనలతో గలిసి బంతు లాడుకొనుచున్నట్లు కృష్ణరాయలు వర్ణించినాడు.

"పసుపాడి పాగడపుపాదంబొప్ప చెంగల్వడిగ్గియనీరచ్ఛ్యుతమజ్జనార్థముకటిం గీలించి దివ్యప్రబంధయుగాస్యల్ ద్రవిడాంగనల్ నడుతురుద్యానంబులో త్రోవలన్" అని తన యాముక్తమాల్యదలో రాయలు ద్రవిడాంగనల భక్తిప్రపత్తులను వర్ణించినాఁడు. "కంచి యుఱవతలసమాస్త్రమ్రుఖడ్గలతల"ని శ్రీనాథుఁడు ద్రవిడాంగనల శృంగారమును వర్ణించినాఁడు.

శతాధిక గ్రంథకర్త-తపస్వి కలియుగవశిష్ఠుండని ప్రసిద్ధివహించిన యప్పయ్య దీక్షితులు "ఆంధ్రత్వమాంధ్రభాషాచ ప్రాభాకర పరిశ్రమః। ప్రాయేణయాజుషీశాఖా నాల్పస్య తపసః ఫలమ్॥" అనెను. ఆంధ్రుఁడై పుట్టుట నాంధ్రభాష నేర్చియుండుట పూర్వజన్మమున మహత్తరమగు తపస్సువలననే లభించును గాని సామాన్యముగా లభింప వని యనినాఁడు.

మా గృహలక్ష్మి ద్రావిడాంధ్రములందు సమముగాఁ బ్రచారమునలుపుటయు, ద్రవిడాంధ్ర విదుషీమణుల సమముగా గౌరవించుటయు నుభయులకు నుండవలసిన స్నేహ సంబంధ బాంధవము నిరూపించుచున్నది. ఇరుగుపొరుగు కాపురములైనపుడు సరిహద్దు లొండొరులు దాటిన సవరించుకొనవలసివచ్చునే గాని లేనిచో కార్యములయందు, ఖడ్గ ములయందు, నిచ్చి పుచ్చుకొనుటయందు, విందులయందు, వినోదములయందు బొంది పొసగుట కలదుగదా!

జయంతిసందర్భమున శ్రీమతి రాధామణిగారికొక స్వర్ణ కంకణము—శ్రీమతి చేబోలు సరస్వతీదేవిగారికొక స్వర్ణకంకణము గృహలక్ష్మి యొసంగుట పరమానందకరము. అరవ మున జక్కని సాహిత్యముకలిగి గ్రంథములు వ్యాసములు వ్రాయుటకాక సంగీతమున యథార్థముగాఁ బ్రవీణురాలై తనకు, వినువారికిఁ దత్కాలమున బ్రహ్మానందము గలుగఁ

జేయుజాలు కవయిత్రీమణి కవికోకిల రాధామణి సమ్మానమునొందుట యెంతయుఁ దగి యున్నది. గుణమెఱిగి గౌరవించుటయు పిలిచి పెద్దఁజేసి గౌరవించుటయునివి కృతయుగ లక్షణములని చెప్పుదురు. ఆ లక్షణములు సహజముగా మన కేసరిగారియందే కానిపించు చున్నవి.



గీ. కోటదుర్గంబు దుర్గాంబకోట సభకు వాణులకు వీణలకు మణిస్వర్ణములకు
నర్చయును బ్రోపుగలుగుట యబ్బురంబె లక్ష్మి గృహలక్ష్మిగానాంధ్రులనుభజింప.

క. భూసురుఁడు వైద్యవిద్యాభాసురుఁడు త్రిలింగభూమి ఫలభూతుం డ
గ్రేసరుఁడు దానముల నీ కేసరి కీసరికి సాటికిఁగ గలరె యొరుల్.

క. భాషా యోషామణికిన్ భూషలు సమకూర్చఁజాలు నుతచరితలనున్
భూషల నర్చించుట సంతోషము కేసరికి బుధనుతుఁ డతఁడగుగదా.

క. సల్లలితశైలి మల్లెలొ మొల్లలొయను నీదు పద్దెములె పూవులుగాఁ
గొల్లగఁ గొలిచితి సీతావల్లభు సుజనాళిమెచ్చ వాసనహెచ్చన్.

ఉ. భూసురసేవ నీకు సురభూజముగా ఫలియించెఁ గావ్యముల్
చేసితి సత్కవుల్ వినుతిజేసిరిఁకన్ దొరసానిబిడ్డలే
డాసిరి శిష్యురాండ్రుగ దృఢంబగు నీపతిభక్తి నీకు నీ
వేసరి, యున్న సద్గుణము లిక్కలి నొక్కడనో సరస్వతీ.

చ. కవికులమందు సత్పదము గాంచి సరస్వతి వాహనంబవై,
భువి కవికోకిలోత్తమగు పుణ్యచరిత్రము తేటతెల్లునన్
జవులొదవన్ రచించి, కవిచంద్రుల చంద్రిక లీనమాచు ' స
త్కవి కలహంసి 'వన్ బిరుదుగాంచితి మించితిగా సరస్వతీ.

మ. గృహిణీ ధర్మములాచరించుటను గీర్తిం జెందినావీవు మా
గృహలక్ష్మిన్ నడిపింప సాయపడ నెంతేయొప్పుఁ, గావ్యంబుచే
గృహలక్ష్మి బహుమానమందితివి నీవృత్తంబు సామర్థ్యమున్
స్పృహణీయంబులు నాంధ్రభామినులకున్ మేల్బంతివో కాంతరో!

క. కవికోకిల రాధామణి సువర్ణకంకణముతోడ శోభవహించున్
జవులొదవఁ గవితఁజెప్పుచు బ్రవీణయై పాటఁబాడ రాల్గరగంగన్.

## శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారి ఉపన్యాసము

సోదరీమణులారా! గృహలక్ష్మీమణులార!

శ్లో॥ ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేర్జునతిష్ఠతి।
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢానిమాయయా॥

అను గీతాప్రమాణవాక్యమనుసరించి సకల చరాచర వస్తుజాలంబుల కంతర్యామియై జంత్రగాడు బొమ్మల నాడించురీతిగా సర్వభూతంబులలోఁ గారణభూతుండయి వెలుంగు స్వతంత్ర స్వప్రకాశ సత్యసుఖస్వరూపమైన జగన్నాటకసూత్రధారుఁడు ఈవిశాల విశ్వమును లీలావినోదార్థమై యాడించుచున్నాడు. ఆ సచ్చిదానందస్వరూపుఁడగు పరమాత్ముని యనుగ్రహము లేనిచోఁ గార్యరూపులగు మానవులొక గడ్డిపోచనైనఁ గదల్పలేరుగదా! అట్టి నిగ్రహానుగ్రహదక్షుండగు పరమేశ్వరునకిట్టి మహోత్సవసమయమున భక్తిపూర్వక నమస్కారములొసంగుట నా విధి.

"నిరాశ్రయాః నశోభంతే పండితా వనితాలతాః" అనిగదా ఋషివాక్కు.

బాల్యమున మా తండ్రిగారు చక్కని విద్యనేర్పించి కొంత పాండిత్యము గలుగఁజేసిరి. వివాహానంతరము దానిని పెంచి నానాఁటికి వృద్ధిగావించి మెఱుగులుదిద్ది నాకిట్టి సదవకాశమొసంగుచు విద్యాపోషకత్వమున కెన్నెన్నియో మార్గములను జూపుచు వారి కలవడిన యపారమగు ఆంగ్ల జ్యోతిషవిద్యలయందు నన్నును బ్రవీణగఁ జేయుచు స్వయం గురువై, భర్తయై, దైవమై నన్ను కనిపెట్టుచున్న నా భర్తగారీసత్కారమునకు బ్రథమ ప్రధానపాత్రులు. అట్టి పూజ్యుండగు నా భర్తగారికి నా హృదయపూర్వక సాష్టాంగ నమశ్శతంబులు. నాకు విద్యాగురువులనేకులుండినను, సంస్కృత జ్ఞానాభివృద్ధికిఁ దగినంత దోహదమిచ్చి, చక్కని సాహిత్యజ్ఞాన మలవడఁజేసి కావ్యనాటకాలంకార గ్రంథసార మెఱుంగఁ గాఁగల సద్బోధలఁ గావించిన శ్రీమాన్ కంధాడై కృష్ణమాచార్యగురువర్యులకు నా ప్రథమవందనము.

నా కవిత్వ ప్రారంభమునకును అభివృద్ధికిని హేతువు శ్రీ జటప్రోలు సంస్థానాధీశ్వరియగు శ్రీ సురభి వేంకటరత్నమాంబికాధర్మ కల్పవల్లీమతల్లిగారు. వారి అనుగ్రహశ్రీ విశేషముననే వారి సంస్థాన విద్వాంసులగు బ్రహ్మశ్రీ వాజపేయయాజుల రామసుబ్బారాయఁడుగారివద్ద కవితాకళ నభ్యసించుటయేకాక వారు స్థాపించిన స్నేహలతా కవితాసంఘమున కుపాధ్యక్షురాలనై వారి నిరంతర మిత్రలేఖికా ప్రోత్సాహముననే సరస్వతీరామాయణాది కృతులను రచింపఁగలిగితిని. కావున శ్రీ మహారాజ్ఞీమతల్లిగారికిని, రామసుబ్బారాయ గురువర్యులకును నా భక్తిపూర్వక నమస్కారములు.

తత్సంస్థానాధీశ్వరి పుత్రికారత్నమై, చదువుల సరస్వతియై, చక్కని కవయిత్రియై యొప్పారుచున్న శ్రీ ఇనుగంటి రాజ్ఞీ సరస్వతీదేవిగారి కటాక్ష శ్రీలకుఁగూడఁ బాత్రురాల నగుటచే వారికిని నా హృదయపూర్వకాభి నందనములు.

శ్రీ వేంకటగిరి సంస్థానముననున్న సమయమునఁ గన్నతల్లికన్న మిన్నఁగఁగాచి గురుపదమిచ్చి పోషించిన శ్రీ సౌభాగ్యవతి ఇనుగంటి రాజ్యలక్ష్మమ్మగారి ప్రేమ, ఆజన్మాంతము మఱువరానిది. ఆవల వారి పుత్రికామణియగు శ్రీ సౌభాగ్యవతి శ్రీ మీర్జాపుర రాణి భూదేవమ్మగారి యంతఃపుర బాలికలకు విద్యగఱపుచు రమారమి పండ్రెండు సంవత్సరములు వారి సత్కృపాదోహదమున సకల సౌకర్యములఁ గాంచి, సరస్వతీ రామాయణమును సాహిత్యలోకమున కందఁజేయు భాగ్యమునుగూడఁ గాంచుటంజేసి ధర్మస్వరూపులగు శ్రీ భూదేవమ్మగారి నేసమయానవైనను దలఁచుకొనుచు నా సంపూర్ణ కృతజ్ఞతను వెల్లడించుకొనుచునే యుందును.

ఆ యీ భాగ్యవిశేషముననే నేటిసభలో నిలుచు సుకృతమునుగాంచఁ గల్గితిని. నేఁటి యీ గృహలక్ష్మి కంకణసన్మానమునకు ముఖ్యకారణము, లలితకళోపాసకులును, ధన్వంతరీయంశ సంభూతులును, స్త్రీవిద్యావిజ్ఞానప్రబోధ దీక్షావ్రతులునునగు డాక్టర్ శ్రీయుత కేసరిగారి యవ్యాజవాత్సల్యాతి రేఖయేగాని వేఱొండుగాదు. ఆమహాశయునకు ఆకళాపరిపూర్ణ నిధానమూర్తికి నా అభివందనములు.

నేఁటిమన సభ కగ్రాసనాధిపత్యము వహించియున్న శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి దేశసేవాధురంధరత్వము, స్వార్థత్యాగము, కార్యనిర్వహణదీక్ష, విద్యాప్రాభవము ప్రస్తుతింపఁదగినది. స్త్రీజనోద్ధరణమునకును ఆంధ్రరాష్ట్ర స్వాతంత్ర సౌభాగ్యమునకు వీరు సర్వశక్తులుధారబోసి పూర్ణోత్సాహముతో కృషిసల్పుటయేగాక ప్రతివనితారత్నమును తనవలెనే త్యాగమూర్తియై సర్వతోముఖ ప్రజ్ఞతో నిరాడంబరముగా కృషిసలుపవలయునని ఆశించియున్నారు. కావుననే సారస్వతసేవలో తొలిమెట్టులో నున్న నన్ను గొప్పగాపొగడి జర్నలిజంలోకూడ నారితేరినదానసని ప్రోత్సాహించి శక్తికి మించిన భారము నాపై మోపియున్నారు. ఇది వీరిసదాశయము. కానిండు; దీనికి డాక్టర్ శ్రీయుత కేసరిగారును నాకు సదవకాశముగల్పించి పోషించుచున్నారు. ఇట్టి నిశ్చలసేవా పరాయణుల యాశీర్వచనములు వ్యర్థములగునా ? వీరి యుద్యమము సఫలీకృతముగావించి సేవజేయుటకై నాకు శక్తి సామర్థ్యములఁ బ్రసాదింపఁ బరమేశ్వరుని వేడుచున్నాను.

"విద్వానేవవిజానాతి విద్వజ్జనపరిశ్రమం" అను వాక్యానుసారముగ శ్రీ తిరుమల శ్రీనివాస త్రిలింగమహా విద్యాపీఠమునకు ధర్మాధికారిణియై, కవి సార్వభౌములకు సత్కారము జేయఁజాలిన మనసోదరీమణి కవితిలక, కవితావిశారద, కాంచనపల్లి

కనకమ్మగారు జీవయాత్రాది మహాప్రబంధముల రచించినవారు గావున సరస్వతీరామాయణము నామూలాగ్రముగాఁజదివి సారముగ్రహించి అందులో నుత్తరకాండమును 1938 సం॥ Madras University లో పఠనీయగ్రంథముగఁ బెట్టించి వారికి నాయందుగల యాదరాతిశయముల వెలిబుచ్చిరి. అంతయేగాక నేఁడీసభ కేతెంచి సరస్వతీరామాయణములో నచ్చటచ్చట కొన్నిపద్యములను విమర్శించి సభవారి కాహ్లాదము గలుగఁజేయుటయేగాక నాపై కూర్మిపెంపున 'కవికలహంసి'యను బిరుదమునుకూడ ప్రసాదించి ధన్యఁగావించినందులకు వీరికి నాహృదయపూర్వక కృతజ్ఞత వెల్లడించుచున్నాను.

ఈసభ నలంకరించిన నాసోదరీమణులందఱును విజ్ఞానధన్యలే. కావున నేను క్రొత్తఁజేసి చెప్పఁదగిన విశేషధర్మమేమియులేదు. నేఁడు నన్నొకపెద్దఁజేసి గౌరవించిన నాతోడి సోదరీమణులకు నావందనములు. ఒక్కొక్కరికొక్కొక్కకళ యందభిరుచియు నభిమానమును గలుగుట నైజము. అందుచే మనమందఱమును నొకరికొకరు'గృహలక్ష్మి' కటాక్షమున నెలకొకసారి పత్రికారూపమునఁ జూచుకొనుచు, డాక్టరు కేసరిగారి అనుగ్రహమున వత్సరమున కొకసారి కలిసికొనుచు వివిధములగు మనభావములను నేకముజేసి యేకాకారమును గల్పించి, యేకీభవించుచు, భాషాభివృద్ధికిని, మన సంఘాభివృద్ధికిని, దాన మనదేశ సౌభాగ్యవర్ధనమునకును ననువగుమార్గములను వెదకిగొనుచు-తనువుగాంచిన ఫలమును భాషాసేవచే నందు ముఖ్యముగ మనయున్నతాభివృద్ధి కాదర్శకమగు గృహలక్ష్మి సేవచే యాత్మవిజ్ఞానసిద్ధినిఁగాంచు తత్వగ్రంథములం జదివికొనుచు, రచించుచు,

> "Getting and spending we lay waste our powers
> Little we see in Nature that is Ours"

అను Wordsworth మహాంగ్లకవిచెప్పిన వేదవాక్యమనుక్షణము సంస్మరించుకొనుచు, ప్రకృతిలోఁబుట్టి, ప్రకృతిలోఁబెఱిఁగి, ప్రకృతిలో లీనముగానున్న మనము ప్రకృతి సౌభాగ్య తత్వమించుకైనను నెఱుంగకున్న జన్మమేరీతి సార్థకముగాఁగలదని చింతించుచు, పవిత్రవంతముగ జేయఁజాలు జీవయాత్ర నభిలషించుటయే మనముఖ్య కర్తవ్యమని నా ఆశయము. వేయేల? జీవయాత్ర నీవిధముగ సాగించుకొఁగలిగిన వారి జన్మయే జన్మ.

> "Banish evil words and strife
> Keep thy heart a temple holy
> Love the lovely and the lowly
> Thus shall eachday be a jewel
> Stung upon thy thread of life."

నిశ్చలత్వము, విశ్వమానవప్రేమ, దయాసత్యాశౌచ నిష్ఠాగరిష్ఠత్వము, మానవులకు పెట్టనిభూషణంబులు. అవిగాంచిన వారిబ్రతుకే బ్రతుకు. అవిగాంచినవారికి సకలార్థంబుల రచేతనుండు. అన్నిసుగుణసంపదలతో నలరారుచున్న మన గృహలక్ష్మి యొకటే నేఁడు

మనకండ్లకు బ్రత్యక్షముగాఁ గనఁబడుచున్నది. కావున కవితారూపమున నా ఆశయము లను గానముజేసి గృహలక్ష్మికి కానుకబెట్టి విరతు.

మ. పదిరెండేడులు నిండినిండకయ శ్రీభాషావధూటీకృపన్
గుదురై నేర్చితివమ్మ సర్వకళలన్ గూలంకషప్రజ్ఞతో
మదిలో నెక్కొను ప్రేమతత్త్వములచే మర్యాద పాటింపుచున్
సుదతీ లోకకళాప్రబోధమునకై శోభింతు క్రొంగ్రొత్తగన్

మ. తలక్రిందయ్యెను గాలమిప్డు దగువిద్యల్ నేర్వమింజేసి కాం
తలు ; సత్కీర్తి కొఱంతయయ్యె సహజస్థైర్యంబు ధైర్యంబులున్
వెలితిన్ జెందెనటంచు నీవెఱిఁగి సద్విద్యావిధానంబులో
సులభోపాయము జూపినావుగద నీ సుజ్ఞానమేపాటిదో !

క. గురువరు నాదేశంబటు
శిరమున ధరియింత్రు నీదు చిఱుకథలు మనో
హరములు ; బాలికలెంతో
మురిపెముతోఁ జదువుచుంద్రు ముద్దలరారన్.

ఉ, కొందఱు గద్యమేచదువఁ గోర్కవహింతురు పండితాళిలోఁ
గొందఱు పద్యసారములఁ గ్రోలి సుఖింతురు ; నైజమేకదా !
యందఱి యాశయంబులకు నర్మిలి సమ్మతిఁగూర్చి రెంటిలో
సుందరమైన పోకడలఁ జూపుదువెప్పుడు నూతనంబుగన్.

ఆ. వె. పుత్రికొక్కబుద్ధి పుట్టును ధరలోన
జిహ్వకొక్కరుచియుఁ జెలగుచుండు
సర్వజనుల కోర్కె సఫలంబుజేయఁగా
వివిధభావసరణి వెడలుదీవు.

ఉ. కేసరి ముద్దుబిడ్డ ! కవికేసరులెందఱో నీదుపుష్టికై
వ్యాసములిచ్చుచుండ ననవద్య సువిద్యలకెల్ల రాణివై
వాసియు వన్నెయుంబడసి వారిజనేత్రలచేతి చిల్కవై
భాసిలుచుంటివిప్పటికి వర్ధిలుమమ్మ చిరాయురున్నతిన్ !

క. ధాత్రింగల సుచరిత్రల చిత్రంబులు నీకువింత చెలువము గూర్పన్
నేత్రోత్సవదాయకమై మిత్రులకున్ మేలుఁజేసి మించితివమ్మా !

ఉ. కేసరి కూర్మిబిడ్డవయి కీర్తిగడించుట లొక్కయెత్తు, శ్రీ
కేసరి నామధేయమును గీర్తనసేయఁగ వాడవాడలన్
మాసము దాటకుండఁ జని భామలకెల్లను దెల్గుభాసలో
నాస జనింపఁజేతువు దయానిధివాచు శుభప్రదాయినీ !

మ॥ గృహలక్ష్మి! గయికొమ్ము నాదు వినతుల్ గీర్తింతు నిన్నెప్పుడున్
మహితంబైన సువర్ణకంకణము నా నామాక్షర శ్రీలతోఁ
రహిఁగల్పించెదు దాని నాకరమునన్ రాణింపఁగాఁజేసితి
వహహా! నెచ్చెలివన్న నీకెతగు సుమ్మా! మిత్రచింతామణీ!

ఉ. శాంత సమత్వ తత్వములు సత్యనిరూఢియు దైవభక్తియున్
జింతలఁజిక్కు మానవుల సేమముగోరి కృపార్ద్రదృష్టితో
వంతలబాపిబ్రోచుట స్వభావము కేసరి! నీకిలన్ యశో
వంతుఁడవీవ; వ్రేల్మడచువారలు నీయెడలేరు చూడఁగన్!

క. వనితల విద్యోన్నతికై మనమున స్వార్థంబువీడి మానవసేవా
ప్రణవోపాసనఁజేయుచు ఘనయశమార్జించినట్టి ఘనుడవు కావా?

సీ. ఏకుటీరము శాంతి కాకరంబైయుండు నదినీకు సతత విహారభువన
మేకుటీరము బుధానీకసంవాసమౌ నదినీకు దోబూచులాడు సదన
మేకుటీరము విద్యకిచ్చు ప్రధానంబు నదినీకుఁ గైసేయు వేశ్మవరయ
నేకుటీరముపేరు లోకవిశ్రుతమయ్యె నదినీకు మరబొమ్మలాటగీము

గీ. చెలఁగి భారతి యెవ్వోట చిందులాడు నెచటఁ గేసరి సత్కృపాదృష్టియెసఁగు
నట్టి నిలయంబు నీకాటపట్టుగాఁగ వర్షశతములు జీవించి వరలుమమ్మ!

క. జయజయ గృహలక్ష్మి సఖి!
జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ!
జయజయ విద్యాప్రబోధ! జయకల్యాణీ!

# జ్వర పరిశోధననుండి తెలుపబడిన విషయము

స్వస్థతజెందుటకు ఆహారము ముఖ్యముగా తోడ్పడును. మానవులకు జ్వరమునుండి గలుగు ఫలిత మునుగురించి డాక్టర్లు కొన్నివిషయములను వెల్లడించినారు. ఉష్ణము హెచ్చుట, కంటిమీద తీక్ష్ణమైన తలనొప్పి, ప్రారంభమున కొంచెము చలివేసి తరువాత దేహము వణకునట్లుచేయుట, ఇవే జ్వరలక్షణములు. దీనికి కారణము జ్వరమునందలి విషము నరములలో, మాంసకండరము లలో అతివేగముగా ప్రాకుటచేత, అందువల్ల జ్వరపీడితుడు మిక్కిలి అలసి నిర్బలుడగును.

కడుపు బలహీనముగానుండుటచే, సాధారణ ఆహారముకూడా జీర్ణమగుటకు కష్టముగానున్న ప్పుడు, అలసిన అవయవములకు బలమును తిరిగి చేకూర్చుటెట్లు అనునదే గొప్పవిషయము. హార్లిక్స్ చాలకాలము ఉపయోగింపబడి, ఇది తగుమైన ఆహారమనియు, జీర్ణశక్తికి ఏలాటి హాని కలుగజేయదనియు, సత్తువ నిచ్చునదియు రుజువుపరుపబడినది. ఇది రోగమునుండి తేర్కడ జెందుకాలమును తగ్గించును. ఈదేశమందలి గొప్ప ఆస్పత్రులలో నెల్లజ్వరబాధితులకు ఈ ఆహారమును ఇచ్చుటకు ఏర్పాటుచేసినారు.

## *Congratulatory messages to "Grihalakshmi"*

"Let me on the 13th birthday of your journal express my hearty congratulations for the yeoman services rendered by the journal to the Andhra Desa, particularly to our womenfolk....................I recommend this magazine with great pleasure as an ornament that should adorn every house."

V. A. B. SASTRI, B.A., L.L.B.

"There is little exaggeration if I say that "Grihalakshmi" as a journal is unique and has justly carved out for itself a niche in the temple of fame. As a regular reader I have found it not merely of absorbing interest but profoundly instructive to every reader..............By its inherent merits it has become almost indispensable for every Indian household and no wonder if in the light of its wide popularity it has successfully enlisted the interests of its readers even in parts where the predominant language happens to be Canarese.

I wish every success to the journal."

Y. R. P. GOUD, M.A.

## 'గృహలక్ష్మి' పత్రికాభిమానుల ఆశీస్సు సందేశ వాక్యములు

"ఆంధ్రదేశమునకంతకు, ముఖ్యముగా ఆంధ్రమహిళామండలికి అపారమగు సేవనుచేసిన 'గృహలక్ష్మి' యొక్క పదమూడవ జన్మదినోత్సవ సందర్భమున నీ పత్రికయొక్క ఘనతనెంతయు నభినందించుచున్నాను. ఈ పత్రిక ప్రతి ఆంధ్రగృహమునందును ఒక అలంకారముగ నలరారునని అమితోత్సాహముతో నాశించుచున్నాను."

వి. ఎ. బి. శాస్త్రి, బి. యే. ఎల్. ఎల్. బి.

"యశోవైభవాలయములో విశేషశోభతో వెలయుచున్న 'గృహలక్ష్మి' పాఠకులకెల్లరకును బహు ప్రమోదముతోగూడిన జ్ఞానప్రబోధమును గావించుచున్నదనుట అతిశయోక్తి కాదు.

స్వభావసిద్ధమగు సుగుణసంపదతో నొప్పుచున్న ఈ పత్రిక ప్రజాదరముతో ప్రబలవిజయమునొందుచు, కన్నడము మాతృభాషగనున్న ప్రదేశములలోగూడ తెలుగుభాషావిజ్ఞానమును వ్యాపింపజేయుచున్నది. ఈ పత్రిక సర్వవిధముల విజయవంతమై వర్ధిల్లుగాక!"

వై. ఆర్. పి. గౌడ్ యం. ఏ.




ఏ కాంత సాన్నిధ్యసౌఖ్యము ఏకాంత శాంతిసౌఖ్యమున కెనవచ్చును ?

ఏ సాధ్వీమణియొక్క సహజసుందరరూపము వల్కల ధారణముచే సయితము చెలువున మించునో, ఏ సతీమణియొక్క సత్శీలసంపద సంఘములో పవిత్రభావప్రసూనములను వెదజల్లజాలునో, ఏ మానినీమణియొక్క మంజులాలపములు శ్రోతల మానసములను చూఱగొనగల్గునో, ఏ సుందరీరత్నముయొక్క చూపు మనోరమ చల్లని సౌమ్యదృష్టిని బ్రసరింపజేయునో, ఏ సుదతి, జీవితములో సొంపునింపు లలితకళారాధన మహిమచే సంసారమునకు శోభ నొడగూర్చునో, ఏ మానవతి తన మృదుమధురభావములచే చేతోమోదమును ఆంతరంగికానందమును ప్రసాదింపగల్గునో, ఏకాంత నిజకాంతుని సంసారజీవితములో తరింపజేయునో, ఆకాంత శాంతిస్వరూపిణి యనబరగును. ఆయమ జగద్వందితయై మాతృదేవతయై, ప్రకృతివైభవమును తన వ్యక్తిలో ప్రత్యక్షమొనరించును.

ఏకాంతమునే యెల్లపుడన్వేషింప నభిలషించుచు, ప్రకృతివైభవముతో నైక్యము నెందగోరుచు, ఆత్మానందము నెల్లవేళల ననుభవింప నుత్సాహించు యోగీంద్ర హృత్పుటములలో గననగు ఏకాంత శాంతిసౌఖ్యమున కెనవచ్చు ప్రశాంతభావప్రకాశమును పైన పేర్కొనబడిన సల్లక్షణములతో గూడిన పడతియొక్క దివ్యసందర్శనభాగ్యముచే గల్గును.

ఇట్టి యుత్తమసతి నెందైన జూడగలమా ? ప్రస్తుతప్రపంచములో నట్టి దివ్యాదర్శములను ప్రత్యక్షముగ గనుట సందేహము. కాని దుస్సాధ్యముకాదు. పూర్వులు మానవకోటియొక్క పురోభివృద్ధికై పురాణములలో నట్టి దివ్యసుందరీరత్నముల చరిత్రలను లోకమునకు ప్రసాదించియున్నారు.

పురాణమహిమార్ణవములో పుట్టి, ప్రపంచప్రఖ్యాత ధర్మవిలసితమగు హిందూమతభువనములో పెరిగి, పుణ్యవంతమగు భారతమాత హృదయపీఠికపై తేజరిల్లి, ఆదర్శనారీశిరోరత్నమై, ఆచంద్రతారార్క విలసితమగు సత్కీర్తివైభవమును విస్తరింపజేసిన శ్రీ సీతామహాదేవి యిందులకు దివ్యదృష్టాంతమై చిదాకాశమున వెల్గుచున్నది.

'రామునివంటి శూరుడు లేడు, సీతవంటి సతిలేదు' అన్న సామెతను చిన్నపుడు ప్రాథమిక విద్యాతరగతి గ్రంథములలో నందరును సామాన్యముగ జదివియేయుందురు.

కాని శ్రీ వివేకానందస్వామి చెప్పినటుల రామునివంటి శూరులును, దివ్యపురుషులును ధరలో జన్మింపవచ్చును. సీతవంటి సతిమాత్రము భువిలో మరి పుట్టబోదు.

అట్టియెడ సీతవంటి సాధ్వీమతల్లిని జూచు భాగ్యమెట్లాదవును ? శ్రీమద్రామాయణమును పఠించి సీతామాతనుగూర్చిన వర్ణనములన్నిటిని చిత్తమున జేర్చికొని, ఊహ యను కలమును (కుంచను) చేబూని భావము లనురంగులతో హృదయఫలకముపై చిత్రించుకొనగల్గుచో శ్రీ సీతామహాలక్ష్మియొక్క దివ్యశుభాకారమును సాక్షాత్కరింపజేసికొనగల్గుదుము.

ఆ పావనమూర్తియొక్క దివ్యచిత్రమును జూచు మనోనేత్రమునకు జ్ఞానోదయమగును. ఏకాంతమునందు ధ్యానమహిమచే, శ్రీ సచ్చిదానంద బ్రహ్మముయొక్క దివ్యస్వరూపమును సందర్శించి, సంయమీంద్రు లేదివ్యశాంతిసౌఖ్యము ననుభవింపగల్గుచున్నారో అట్టి శాంతిసుఖమును శ్రీ సీతాసతీమణియొక్క మంగళస్వరూపమును సాక్షాత్కరింపజేసికొనిన సంసారులును అనుభవింపగలుగుదురనుటకు సందియములేదు.

ఏకాంతములోనున్న ఆనందానుభవము ఏ కాంత సందర్శనభాగ్యముచే లభించునో ఆకాంతయే శ్రీ సీతామహాలక్ష్మి. మోహప్రపంచము కనిపెంచిన కాంతాకనకములలో నీ దివ్యదృశ్యములు గోచరింపవు. కాని జ్ఞానకాంతాసాంగత్యముచే, యోగవిభూతి మహిమనుపొంది భౌతికప్రపంచమును కనక ముక్తికాంతా సాన్నిధ్యములో ఆ ఏకాంత సాంగత్యసాధనసత్ఫలితమగు శాశ్వతశాంతి సౌఖ్యమును సంపూర్ణముగ ననుభవింపనగును.

సంఘములో స్త్రీలకు పురుషులతో సమానత్వ మేర్పడవలెను.

స్వర్గీయ డాక్టరు యు. అభయాంబల్ స్మారక చిహ్నముగ నేర్పాటుచేయబడిన ఉపన్యాసములలో రెండవదియు కడపటిదియునగు ఉపన్యాసమును గా॥ యస్. శ్రీనివాస శాస్త్రిగారు గత జనవరి 31-వ తేదీని మైసూరులో నొసంగియుండిరి. ఉపన్యాసకులు ఉవిదలకు సంఘములో సమానగౌరవ సభ్యత్వములుండవలెనని వ్రాకుచ్చుచు వారి యభివృద్ధికై వలయు వివిధహక్కులను గూర్చి విపులముగ దెల్పిరి.

వారి ఉపన్యాసములోని ముఖ్యసారాంశమొక్క వాక్యములో చక్కగ దెలుపబడినది. "Better harmony and peace could be established in Indian homes if man and woman had learnt to regard each other as equals and honoured companions, as sharers of each other's confidences and ruling over their family affairs in common" భార్యాభర్తలన్యోన్యప్రేమను వెల్లడించుకొనుచు, సమానగౌరవభావములతో చెలంగుచు, సంసార విషయములను సమానబాధ్యతలతో నిర్వ

హించుచో శాంతియు సుఖమును సంపూర్ణముగ ననుభవింపగలుగుదురనుటలో నెంతయు సత్యమున్నది.

వనితలను వంటఇంటి కుందేళ్లనుజేసి, వారికి స్వేచ్ఛయనునది సర్వవిషయముల లోను నిరాకరించి, పడకటింటి భామలుగ పరిగణించి, భోగములకే వారిని బ్రహ్మపుడమిలో పుట్టించెనని భావించి, సంతానమునుగనుటయే వారిజీవిత పరమావధియని సిద్ధాంతీకరించి, వారి శారీరకమానసిక, ఆధ్యాత్మికాభివృద్ధి నవరోధించి, కీలుబొమ్మలవలె వారిని గణనచేసి, స్వార్థపరాయణులై, భోగలాలసులై, పలువిధముల వారిని పీడింపబొల్పడుచున్న పురుషుల దౌర్జన్యము సంపూర్తిగ నశించినకాని సంఘముయొక్క క్షేమమును, మానవజాతియొక్క పురోభివృద్ధియు సమకూరవు.

స్త్రీ పురుషులలో ఒకరు హెచ్చని కాని ఒకరు హీనమని కాని సృష్టిలో భేదము లేర్పడియుండలేదు. పురాణములలోని స్త్రీ పురుషుల జీవితాదర్శములలో నట్టి యంతరము లెంతమాత్రమును గోచరింపవు.

సంఘములో కాలక్రమమున గలిగిన పలుమార్పులచే నిట్టి క్షీణదశ సంప్రాప్తించినది. విద్యాబుద్ధులు విపరీతములై పరిణమించుటచే స్వజాతి గౌరవమర్యాదలు సమసిపోయినవి. స్త్రీలు విద్యాపరిశ్రమకుబూని, పురుషుల అహంభావము నడంచినగాని సంఘములో సమానత్వమేర్పడదు. పురుషులు బుద్ధిని విడనాడుటచేతను, స్త్రీలు పవిత్రప్రేమాదర్శములను బాయుటచేతను ఉభయులును పతితులై, అన్యోన్యానురాగమును విడనాడి, దురభిమానముతో త్రుళ్లిపడుచు, పరస్పరసంఘర్షణమునకు పాల్పడి, సంఘమునకును దేశమునకును చేటును గూర్చుచున్నారు.

ఆదర్శములడుగంటుటచే, అహంకారమధికమై, స్వార్థపరత్వముప్రబలి, స్వధర్మములను, స్వగౌరవమర్యాదలను అతిక్రమించి యెవరి యిచ్చవచ్చినరీతిని వారు నడచుచు సంఘముయొక్క కట్టుబాట్లను త్రెంచుకొనుచు, స్వేచ్ఛతో సంచరింపజూచుటచే, సంసార బాధ్యతలు క్షీణించి, భిన్నభావములు చెలరేగిపోయి తుదకు శాసననిర్మాణముచే సంఘమును చక్కజేయవలసిన హీనస్థితిగతులుకూడ ఏర్పడియుండు టెంతయుశోచనీయము.

మతవిజ్ఞానము దేశములో ఎప్పుడు క్షీణించినదో అప్పుడే సంఘముయొక్క క్షేమమునకు హాని వాటిల్లినది. స్త్రీ పురుషులు సమానగౌరవప్రపత్తులతో మెలగుటకై మానవ జాత్యభివృద్ధి కాధారభూతములును మూలసూత్రములును అగు మతవిజ్ఞానాదర్శములు పునరుద్ధరింపబడవలెను.

Edited by Dr. K. N. Kesari, Printed and Published by Dr. S. Seshagiri Rao,
at the Lodhra Press, 15, Westcott Road, Royapettah, Madras.

# గృహలక్ష్మి జయంతి మహోత్సవము

## శ్రీ గోనెల నరసింగరావు యం.ఏ. బి.యల్. గారి ఉపన్యాసము

**అధ్యక్షురాలా, సోదరీ సోదరులారా!**

నేఁడు చాల సుదినము. 'గృహలక్ష్మి' బాలకు పన్నెండేండ్లు శుభప్రదముగ, ముదావహముగఁ గడచినవని నిరూపించుదినము. ముద్దులుగేరు 'గృహలక్ష్మి' నేఁడు నునుసిగ్గుదొంతరలతో, మందహాసచంద్రికలతో, సుందరవదనారవిందముతోఁ గడకన్నుల మ్రొక్కులతో, నూత్నయౌవన మర్యాదలతోఁ గనుల కింపునింపు సుదినము. చిఱుగజ్జెల మ్రోఁతలకుఁ జిందులుత్రొక్కు 'గృహలక్ష్మి' బాల నేఁడు మురళిరవళించి యాంధ్ర జాతీయ రక్తనాళములు పులకరించునట్లు దివ్యగానము చేసుకొను చానయైనది. మాటలందు, పాటలందు, తెలివితేఁటలందు, మృదులత్వము, మధురత్వము, మంజులత్వ మలవరించుకొనుచున్నది. దేశసేవ, సంఘసేవ, భాషాసేవ, కళాసేవ, విశేషించి స్త్రీయ జాతీయసేవ, నిరుపమధృతితో, నిర్మలమతితో నిర్భరానందముతోఁ జేసుకొనుచున్నది. ముగ్ధయయ్యు నాంధ్రత్వము, యమలత్వము, యమృతత్వము, యఖండత్వము, యద్వితీయత్వము, యనురాగతత్వము, యలౌకికమైన ప్రేమతత్వము, యనూనమైనసతీత్వము, యసమానమైన మాతృత్వముఁ బెంపొందించు ముద్దుముచ్చటలాడుకొనుచున్నది. మూఁడు పదియేఁడుల జీవికింతటి ప్రజ్ఞ, యింతటి విజ్ఞాన మెట్లలవడినది? సుధాభావప్రపంచములో సదా విహరించు శ్రీ కేసరిగారి వలననేయని సమాధాన మీయవలసియున్నది. వారి హృదయౌన్నత్యము, యౌదార్యము, యౌచిత్యము వారి యనుఁగుంగూఁతురగు 'గృహలక్ష్మి' వారసత్వపుహక్కుగఁ దెచ్చుకొన్నది; సందేహములేదు.

ఇఁక నీ 'గృహలక్ష్మి' కన్య నింతవఱకు ముద్దులాడి, ముచ్చటచెప్పి, మురిపెము గూర్చిన ముదితలలో ముఖ్యులు శ్రీమతులు, కనుపర్తి వరలక్ష్మమ్మ, కవితిలక కాంచనపల్లి కనకాంబ, చిలకపాటి సీతాంబ, బాలాంత్రపు శేషమ్మ, దివాకర్ల శారదామణి, ఆచంట సత్యవతమ్మ, గంటి కృష్ణవేణమ్మ, కామరాజు మైత్రేయి, తెలికిచర్ల వసుంధరాదేవి, డి. అనసూయాదేవి, కె. సుగుణమణి, పాకల రాజామణెమ్మ, అడపా సుగుణమణి, సామవేదుల చిరంజీవమ్మ, వట్టి శేషాంబ, సి. వి. రమణమ్మ మొదలగువారు. వివిధ చిత్రములతో 'గృహలక్ష్మి' కలికిదేహము నలంకరించి తెలుఁగుఁదనమును, కలా కమ్మఁదనమును దశదిశలను వెలిగించి, యాంధ్రావనిని బులకరింపఁజేసిన శ్రీ రత్నాల కమలాబాయి గృహలక్ష్మికొక చక్కని యక్క; పెట్టనినగ; కట్టనికోట.

ఇట్టి విదుషీమణు లనుక్షణము, 'గృహలక్ష్మి'ని తీయనిదృక్కులతో పాయని యనురక్తితో నాదరించుటవలన, గృహలక్ష్మి చక్కని దేశాభిమానముతో, చిక్కని

యాంధ్రజాతీయతతో నున్నత భాషాజ్ఞానముతో, నుజ్జ్వల కళాకాంతులతో, నుత్తమ సతీత్వ గౌరవముతో, మాతృత్వ మర్యాదలతో, నీతివంతముగ నియమబద్ధముగ, నిజ పోషణ గావించుకొనుచున్నందున నేఁడు మనయందఱి యభిమానములనుఁ జూఱఁగొని, యభినందనముల నందుకొని కనులకు విందై, చెవులకు పసందై యలరారుచున్నది.

ఇట్టి యాదర్శ పత్రికాపుత్రికయైన 'గృహలక్ష్మి' కీశ్వరుఁడు బ్రహ్మాయు వొసంగి యాశీర్వదించునుగాక!

## ఆశీస్సు

ప్రత్యేకపత్రికా ప్రచురణగోరెడి పొలతులు ముదమంద బుట్టినావు
గద్యపద్యాత్మక గంభీరరచనల తీయనిభావాలు తెలిపినావు
సహజసుందరములౌ సత్కథాప్రతిభలు సొంపునింపులు గుల్క జూపినావు
విద్యావతుల నెంచి విభవాన బంగారుకడియాలు కేలను దొడిగినావు
పదియు రెండేఁడుల చిఱుత ప్రాయముననె
మోదమొనగూర్చె స్తుత్యమే నీదుచరిత
మేలు 'గృహలక్ష్మి' యిటులనే మెలగి సతము
జన్మవాసరములు పెక్కు జరుపుకొనుము

—శ్రీ కనుపర్తి వరలక్ష్మమ్మ.

## శ్రీమతి చెబ్రోలు సరస్వతీదేవి ప్రశంస

చ. లలితపదార్థభావ రసలాలితమై రమణీయ సత్కథా
విలసితమై, సమంచిత నవీనపదోన్నత శైలియుక్తమై,
యలరి సరస్వతీ రచితమై, వనితాజన కీర్తిగూర్చు రీ
తుల తులకించు రామకథతో సరివచ్చునె యన్యకావ్యముల్.

ఉ. శైలి పదాలు భావము రసంబు కథారచనావిధానముల్
చాలగ తీర్చిదిద్ది సరసంబుగ రామచరిత్ర వ్రాసి యాం
ధ్రాళికి మేలుజేసిన మహామహిమాన్విత పుణ్యమూర్తి చే
బ్రోలు సరస్వతీ వనితబోల్కవయిత్రులు ధాత్రిగల్గిరే.

ఉ. తీయని తేటమాటల గుదించిరసంబులు సోనలూర రా
మాయణము వ్యయార్థమయమై యలరార సదా సరస్వతీ
తోయములం జరించు నవతోయజనేత్ర సరస్వతీసతిన్
బాయని కూర్మినోముత నపారదయన్భగవంతుఁడెప్పుడున్.

## గృహలక్ష్మీ జయంతి మహోత్సవము

క. మొల్లవలె రామచరితము
సల్లలితవు భక్తిఁ వ్రాసి సజ్జనసుతులన్
కొల్లగ గాంచితి వభినవ
మొల్లా నినుసత్కరింప మోదముగలిగెన్.

గీ. ఆంధ్రజనయిత్రి గనమునందలరునట్టి
విదుషిరత్నాల మాలకు వెలుగుదెచ్చు
మేటి రత్నంబ వీవంచు జాటవచ్చు
నిఖిలసాహిత్యరచనల నిపుణవగుట.

—శ్రీ దేశిరాజు భారతీదేవి.

# అనుమోదము

చ. అరసితి త్వత్ప్రబంధము నహాయనిపించె కవిత్వధోరణీ
గరిమ మనోజ్ఞభావముల కల్పనయున్ రసపోషణంబు పా
మరులకుగూడ నర్థమగు మంజుపదగ్రథనంబు నాకు సం
బర మొనరించె నీకొసగవచ్చు; సువర్ణపుకంకణంబికన్.

ఉ. శ్రీలు జెలంగునట్టి రఘుసింహునిగాథ; ననూనశేముషీ
లీల; రచించినావు మృదురీతి ప్రబంధముగా సెబాసు! చే
బ్రోలు సరస్వతమ్మ! యికబొమ్ము సువర్ణపుకంకణంబు నీ
కేల ధరించు మిందులకు 'కిమ్మని' ప్రశ్నయొనర్పడెవ్వడున్.

ఉ. రాయలు దాటిపోయె నవురా! యతడున్న భవత్ప్రణీత రా
మాయణ సత్ప్రబంధమునకమ్మ! సరస్వతి! యగ్రహార మే
దో! యొకటిచ్చియుండు ఫలమున్నె గతించినదానినెన్న గా
నీ! యిపుడియ్యబోవు తపనీయపు కంకణమందు తగ్గునే?

శా. 'కే. యస్. కేసరి బాబ'టన్న గృహలక్ష్మీపత్రికా స్థాపకుం
డాయుర్వేదవిశారదుండు వర 'లోధ్రా'భిఖ్య దివ్యౌషధ
ధ్యేయుం డాంధ్రసహోదరీ కవనసందేశ ప్రహృష్టాత్ము డ
మ్మా! యీలాటి సుహృద్వరేణ్యునకు జేయుంజెల్లు కార్తజ్ఞమున్.

శ్లో. జీయాత్ సరస్వతీదేవీ మంగళా శాసనైస్సతాం
యస్యై 'కేసరిణా' దత్తం కానకం కంకణంనవం.

—శ్రీ గుదిమెళ్ళ రామానుజాచార్యులు.

# శ్రీ సరస్వతీ ప్రశంస

రమ్యమై యొప్పునట్టి శ్రీ-రామచరిత
కబ్బమొనరించి యెనలేని ఘనతగాంచ
సార్థమా పేరుదగె సరస్వతివనంగ
ధరణి బంగారమునకబ్బు తావియటుల.

ఉ. మొల్ల రచించె రామకథ ముద్దులుమూటలుగట్ట, ధోరణిన్
మొల్లముగాగ నీవిపుడమోఘ వచోరచనాచమత్కృతిన్
సల్లలితాంధ్రకావ్యముగ సల్పియశమ్ము భృశమ్ముగామహిన్
గొల్లగ గొంటివమ్మ! కయికొమ్మభినందనముల్ సరస్వతీ!

సీ. ఆంధ్రభారతకర్త నతిప్రీతి మన్నించె
రాజరాజనరేంద్ర రాజమౌళి
తెలుగు సత్కవుల నెంతేప్రియమ్మునగాంచి
పటుప్రాభవముగూర్చె వాసిరెడ్డి
వసుచరిత్రాది దివ్యప్రబంధముల కా
శ్రయమిచ్చె శ్రీ కృష్ణరాయవిభుడు
రహి నలంకారశాస్త్రముల సత్కృతుల సం
భావించె నరసభూపాలుడెలమి
అట్టివారలకుద్దియై ఆంధ్రసుకవి
కల్పభూజంబనా పేర్మి గాంచునట్టి
ఘనుడు కేసరి మన్నించి గారవింప
రహిమనోజ్ఞ సువర్ణ విభ్రాజితవయి
వరలు మాంధ్రసరస్వతీ చిరతరముగ.

—శ్రీ చిలకపాటి సీతాంబ.

# గురువాక్యము

ఉ. కమ్మరిమొల్లమేల్ సొగసుగల్కెడు శ్రీరఘురామగాధ స
ర్వమ్మును వ్రాసినందులకు బ్రాప్తములయ్యె యశోలతాంతముల్.
సమ్ముదమొప్పరీతి సరసంబగుభక్తిని నీవుగూడ గా
వ్యమ్మునేడు కాండలును వ్రాసితివట్టులె శ్రీ సరస్వతీ.

## గృహలక్ష్మి జయంతి మహోత్సవము

గీ. పేరుమోసినవారిలోఁ బెద్దవారు
గూడ నీరామచరితంబుఁ గోర్కెఁ దీఱఁ
గొంచెమోగొప్పయో పఠియించినార
లన్న వేఱుగా నీకీర్తి నెన్న నేల?

గీ. నిన్నుఁ బోలిన శిష్యురాలున్నయెడల
గురువునకువచ్చు సత్కీర్తినరయవశమె?
రెండువంశమ్ములకుఁగూడ నిండుకీర్తి
ధనముఁగూర్చితి నీవంటితనయగలదె?

ఉ. నేటికి సార్థకంబులయె నీవిలనోచిన నోములన్ని; యీ
నాటికి నీప్రభావము ఘనంబని కేసరి మెచ్చికొంచు బా
హాటముగాఁగఁ గంకణము నందెదుభాగ్యముగూడ నిచ్చె నిం
కేటికిఁ బెక్కుమాట లభివృద్ధికి నీ 'గృహలక్ష్మి' యుండఁగన్.

చ. గురుని ఋణంబుదీర్చితి వకుంఠితభక్తికి మెచ్చుకొంటి నీ
పరమపతివ్రతా సుగుణభాసితధర్మము స్త్రీకులంబునం
దొరవడియౌనటుల్ దనరుచుండె నికేమియు లోటులేదు శ్రీ
హరి కరుణావిశేషమున నందుదువీవు చిరాయురర్థముల్.

—వాజపేయయాజుల రామసుబ్బారాయఁడు.

## అభినందనాశీర్వాదములు

క. శ్రీరామాయణమాదిగ భూరికృతుల్ పెక్కు లాంధ్రమునఁ గూరిచి స
ద్గౌరవ భాగ్యముఁగను సతి నారీమండలికి భూషణంబనరాదే?

క. ఘనకవితానైపుణిచేఁ దననామము సార్థకమగు ధన్యచరిత్రన్
మన చేబ్రోలు సరస్వతిఁ గొనియాడఁగలండె యెంత కోవిదుఁడైనన్.

ఉ. కోడలిపేరుదాల్చెనని కొంచెము మచ్చరమేనిలేక లో
వీడక యబ్బురంబయిన ప్రేమముతో సిరిపెంచుచున్న పూఁ
బోఁడిని సుబ్బరాయకవిపుంగవ పూజ్యుని శిష్యురాలి నే
పోడిమి సత్కరించినను బోలకయున్నె రసజ్ఞులౌనన్.

క. 'ఘోషా' యను శృంఖలచే యోషామణి బద్ధఁజేయ గురువిద్యార్థ్యన్
భాషాసేవికఁ జేయు మనీషియ లోకోపకార నియతుండనఁగన్.

క. గృహలక్ష్మి కంకణమగు 'గృహలక్ష్మి'కిఁ బోషకుఁడగు 'కేసరి' చేతన్
గృహలక్ష్మి కంకణముఁగను గృహలక్ష్మి 'సరస్వతి'కగు నెల్లశుభంబుల్.

—శ్రీ జనమంచి సీతారామస్వామి.

మ. నినుఁ జేబ్రోలు సరస్వతీసతిని వాణీరూపిణిన్ లోకమా
న్యను రామాయణ గద్యపద్యరచనా నైపుణ్యునన్ స్వర్ణకం
కణ సత్కారమునన్ సపర్యసలుపంగా నెంచె ధన్యాత్మయై
మనుఁగాతన్ గృహలక్ష్మి పత్రిక సతీ మర్యాదకున్ స్థానమై.

సీ. అభ్యసించితి సంస్కృతాంగ్లాదివిద్యలు కవితస్వారస్య సంగ్రహముజేసి
బోధించితివి రాజపుంగవ సంతానమునకు విద్యలనెల్ల మూటఁగట్టి
రచియించితివి కావ్యరత్నంబు రామాయణంబు కావ్యజ్ఞులానంద మొంద
నిలిపితి వైజయంతినిఁగావ్య కన్యకాప్రాణమా జటప్రోలురాజ్యమందు

గీ. మహితలోకోన్నతత్వసంపాదకంబు
కవిజనాదరయుత హేమ కంకణంబు
గాంచితివి నేఁడు గృహలక్ష్మి కరుణఁజేసి
సాధుసాధు సరస్వతీ ! జయమునీకు.

సీ. జటప్రోలురాజ్య రక్షాదక్ష వేంకటరత్నమాంబా కృపారసముబడసి
మీర్జాపురీప్రజా మేదురాదరమూను భూదేవి కరుణ నభ్యుదయమొంది
సురభి లక్ష్మరాయ సోదరీమణి రాజ్యలక్ష్మి కటాక్షలాలనముగాంచి
ఇనుగంటి వంశపావని సరస్వతి దొరసాని చందనచర్చ సలుపఁజెలఁగి

గీ. పద్మనాయక కులము పావనముజేయు
వలఁతిఁ జేబ్రోలు శ్రీ సరస్వతిని స్వర్ణ
కంకణాలంకృతన్ జేయఁ గలిగితీవు
ఏమి గృహలక్ష్మి పత్రికా నీమహంబు ?

మ. దెసలన్ బూవులుపూయఁ గీర్తిలత యుత్తేజంబు పుణ్యాంగనా
రసదృక్కోణములన్ నటింప సుజనుల్ రాపొమ్మనన్ సాటివా
రిసమీపంబున నున్నతిన్ గనుము ధాత్రిన్ బత్రికా ! ముద్దు లిం
పెసఁగన్ గూర్చుచు నాఁడునాఁటికిని సాదృశ్యంబ దృశ్యంబుగన్.

మ. సరి 'లోధ్రా' సవకల్పకంబు సుదతీ సారస్వరూపంబు బా
పురె లక్ష్మిపద పత్రికాకలన మామోదంబు లోకోన్నతి
స్థిరతాధాయక శక్తియుక్తులకు ధాత్రిన్ సాటివా రేరి ? కే
సరి ! వైద్యాగ్రణి ! కొమ్ము మామక నమస్కారంబుతోరంబుగన్.

సీ. స్వాంతమందున నెంత సంతోషమొందునో
మనుమసిద్ధి త్వదుద్యమంబుగనిన
నుల్లమందున నెంత నుబ్బిపోవునో ?
కృష్ణరాయలు నీ చరిత్రంబు వినిన
చేతమందున నెంత ప్రీతిఁజెందునో ? యాప్ర
తాపరుద్రుఁడు నీదు తలఁపు వినిన

# గృహలక్ష్మీ జయంతి మహోత్సవము

గీ. నిండు పదుమూడు వర్షాలు నిండనున్న
నుభయభాషా సరస్వతి నుద్ధరించె
నీదు పత్రిక 'గృహలక్ష్మి' లేదుసాటి
కొల్లఁగొనుమయ్య కేసరీ! గొనములెల్ల.

—విద్వాన్ శ్రీ కేశవపంతుల వేంకటనరసింహశాస్త్రి.

ఉ. జాలుగఁదేనెసోనలొగిజాల్కొన రామకథా ప్రబంధమున్
బాలురుపండితుల్ దనియ భంగిరచించి సువర్ణకంకణ
శ్రీలకుఁదానకంబయినచేతికి సార్థకతన్ ఘటించెఁ జే
ప్రోలు సరస్వతమ్మ! యిఁకఁబొందదె మాగృహలక్ష్మి మన్ననల్.

సీ. ఈమెసుండీకవిత్వేందిరా పరిచర్యతనియకసల్పిన ధన్యురాలు
ఈమెసుండీ రఘురామచారిత్రంబు నొప్పారఁగూర్చిన యోగ్యురాలు
ఈమెసుండీ యాంగ్లహిందీత్రిలింగ భాషలనేర్పుఁబడసిన సరసురాలు
ఈమెసుండీ కవితామండలీమండప స్తంభమైన విద్వాంసురాలు

గీ. రాణివాసంబువిడువని రమణిగాన
మూర్తితోమీకుఁ బరిచయంబునుబొనర్తు
ఈమె మనయాంధ్రకేసరీ కృతసువర్ణ
కంకణముదాల్చునున్న విఖ్యాతురాలు.

ఉ. అంకిలిలేని ధారచెలువారఁగనీయమ స్వర్ణకింకిణీ
కంకణఘల్ఘలారవము గ్రాలఁగదక్షిణ హస్తమెత్తి ముం
దింకరచించుఁగాత పరమేశ్వరతుంగజటాటవీసరత్
కంకణసంకులాభ్రనదిఁగాదను భంగిఁగవిత్వపద్ధతుల్.

గీ. బాల్యమాది సరస్వతీపాదయుగము
నర్చనముజేసికొన్న పుణ్యమునఁజేసి
శ్రీ సరస్వతి విక్రమ సింహనగర
కేసరీదత్త కంకణోద్భాసియయ్యె.

మ. గృహలక్ష్మీమణులార! నేఁడు గృహలక్ష్మి నిత్యసౌభాగ్య ధు
ర్వహుఁడౌ కేసరి స్వర్ణకంకణముచే భాసిల్లఁగాఁజేసెనే
మహిళారత్నము నాసరస్వతికి రామస్వామిచారిత్ర ధు
ర్వహకాశీకుసుమ ప్రదానమున సౌభాగ్యంబు గాంక్షింపరే.

—శ్రీ శేషాద్రిరమణకవులు, శతావధానులు.

శ్లో. శ్రీ చేబ్రోల్ కులసమారామవాసంత్యా నామతోర్థతః
సరస్వత్యా మహాకావ్యం జీయాదా చంద్రతారకం.

మ. చిరసత్కీర్తి నిధానుఁడైన గృహలక్ష్మీపత్రికాస్వామి కే
సరి నీ యోగ్యతయెంచి కంకణముతో సత్కారమున్ జేయుటే
సరి ! స్త్రీలోకము గారవించెనని భాషాసేవలన్ జేసెనం
చరుసంబొందితి దొడ్డవాఁడతఁడటం చానందమున్ దెల్పితిన్.

ఉ. కేసరి సత్కరింపగమకించియొసంగిన కంకణంబు నీ
కేసరి ! యాంధ్రభాష చిలువెంతయునొంద రసంబుతగ్గ నీ
కే, సరిచూచి కావ్యము రచించితి ! కీరితియెల్లఁదక్కె నీ
కే ! సరివారిలో గణనకెక్కితివీవు సరస్వతీసతీ.

ఉ. మొల్లపు మల్లెగుత్తులటు ముద్దగు పద్యచయంబుచేర్చి యా
మొల్ల రచించె దొడ్డకృతి ముందు శతాబ్దమునందు ; నీవునున్
మొల్లలు జాజులోయన మనోహరశబ్దములొప్పఁ గావ్యముల్
మొల్లమిఁగూర్చి మేటియశమున్ గయికొంటి సరస్వతీసతీ.

మ. మురువౌ మువ్వల ముద్దుబంగరు కలమ్మున్ బట్టి సత్కావ్యముల్
మెఱయన్ నీవు రచించువేళ గృహలక్ష్మీస్వామి యర్పించు భా
స్వరజాంబూనద కంకణంబది 'ఝణంఝాణాం ఝణా'మోఘ మం
జురవంబుల్ మనయాంధ్రభూమి వెలయించున్ గాత నీచేతులన్.

గీ. పుత్రపౌత్రులతోడఁ గాపురము పూల
తోటవలె సంపదలఁ దులఁదూగుఁగాక !
గురుఁడు రామసుబ్బారావు కొఱఁతలేక
యాత్మ గృహలక్ష్మితో సౌఖ్యమందుఁగాక !

—కవిసింహ శ్రీ డి. రాజశేఖర శతావధాని.

చ. సిరి యిలు కెంపునింపరససింధుర మాగృహలక్ష్మి శారదా
కరకరకంకణావళుల కాంతులనిత్యము గౌరవింపకే
సరిబుధలోకసన్నుత విశాలయశోదధి కేసరీంద్రుకే
సరి యలజానకీరమణు సత్కృతికెందు సరస్వతేతగున్.

ఉ. శారద శారదాభ్రవిరజాసమకేతనమైత్రి శాంతి పా
లేరనుకూలవాతగతులేలెడి చంద్రకలాచ్ఛపోతమం
దోరగ సాగిపోయి తరియించినమేరకు దాటిపోయినీ
కీరితికిన్నెరన్నిలుపు కిన్నెరలన్గని పొంగిపోయితిన్.

విద్వాన్ శ్రీ సరిపల్లె విశ్వనాథశాస్త్రి ఎం.ఏ.

# గృహలక్ష్మీ జయంతి మహోత్సవము

శ్లో. శ్రీ మద్రాజమహేంద్ర పత్తనగతో మల్లాదివంశోద్భవో
విప్రఃకోపి కవిప్రియోగణపతిర్నామ్నా విశమ్యాదరాత్
తుభ్యంసంప్రతిదీయమానమథ సంతృప్తః స్వయంకంకణం
శ్రీ చేబ్రోలు సరస్వతీతి కరవాయాశీఃపరం శ్రేయసే.

శ్లో. శ్రీ రామాయణగుంభనోదితయశశ్శ్వేతీకృతాశాంతరాం
శ్రీ చేబ్రోలు సరస్వతీం కవిమణీం శ్రీ నూజివీడుస్థితాం
మచ్ఛిష్యస్యచ సుబ్బరాయవిబుధ స్యాంతేవసంతీంహరిః
పాయాచ్ఛ్రీగృహలక్ష్మి కంకణవతీం శ్రేయోభిరాయుష్మతీం.

—శ్రీ మల్లాది గణపతిశాస్త్రి.

క. కేసరియన నిజముగనర కేసరియేయనుచు నిన్నుఁగీర్తింపంగా
భాసిల్లుము ధారుణినీ చేసెడు సత్కృషిఫలంబు జెందెదురీతిన్.

క. అతిలోకము వైదేహీ పతిచరితము వ్రాసినట్టి భాగ్యవతి సర
స్వతికీ యుత్సవమున సమ్మతిఁ గంకణమొసఁగనీకు మాన్యతగాదే?

క. ధన్యవుగా గృహలక్ష్మీ! మాన్యుఁడు కేసరి సతంబుమన్నింపనసా
మాన్యపథంబునఁ దరుణుల ధన్యలుగాఁజేయు మార్గదర్శినివగుటన్.

—శ్రీ గంధం వేంకటనరసింహాచార్యులు.

చ. సిరికిరవైన యీ తెనుఁగుసీమను మొల్ల రచించె మున్ను నేఁ
డరయ సరస్వతీసతి నయంబుగఁగూర్చెఁ దెనుంగుబాసలో
సరసముగా రఘూద్వహుని సచ్చరితంబు బుధుల్ నుతింపఁగా
గరితలపాండితీగరిమ గారవమొప్ప నుతింపఁజెల్లదే?

శా. అమ్మా! యాంధ్రకవిత్వధీగరిమ నిత్యంబిమ్మలన్ సత్కవుల్
సమ్మోదింపఁగ రాఘవేశ్వరుకథన్ సంస్తోత్రపాత్రంబుగా
నిమ్మాడ్కిన్ రచియింప నీకెతగు నిన్నేరీతి వర్ణింతుఁ గై
కొమ్మా! కొమ్మలమిన్న! కంకణము నీకుంగూర్చెఁ గల్యాణముల్.

క. పలుకుం దొయ్యలిసత్కృప లలిత వచోరచనఁగలవిలాసినివగుటన్
బలుకులజెలిపేరను నినుఁబిలుచుట యనితలఁతు మదినిఁ బెంపునఁదల్లీ!

—డాక్టరు ద్విభాష్యం సత్యనారాయణ.

సీ. చేబ్రోలువంశాన జెటప్రోలు రాజ్యమున్ జేరియే సతిగాంచె భూరియశము
తనపేరుసార్థకమును జేయనేసతి శారదపై వ్రాసె శతకమొకటి
ఆధ్యాత్మికంబుగ నాత్మోపదేశంబు నేసతీతిలకంబు వ్రాసిమించె
స్నేహలతాఖ్యమై చెన్నొందుసుకవితా సంఘానకేసతి సభ్యురాలు

గీ. కొల్లపురిఁజేరి సంఘసద్గురునియాన రామచరితంబు వ్రాసెనేరామ జగతి
నా సరస్వతీదేవికిన్ గేసరి గృహలక్ష్మి కంకణమిప్పుడలంకరించె.

చ. సరసకవిత్వమారసిన సారసలోచన లెంద రెందరో
వరసుకృతంపుమార్గమునఁ బ్రాకట కీర్తిగడించిరందులో
సురుచిర మొల్ల కీడగుచు సుందరమౌ రఘురాముగాథ నాం
ధ్రరచనలందమర్చిన సరస్వతి చూడఁగృతార్థురాలుగా.

మ. పలుచందంబుల సాహితీగరిమమున్ ప్రాచీనపఙ్క్తిన్ నిజా
త్తులకున్ లేఖలలోనిమిడ్చి పరితృప్తుండై సఖుల్ వ్రాయు లే
ఖలలోఁబద్యములున్న సంతసమునన్ గైకోలు గావింపఁగాఁ
దలఁతున్ స్నేహలతాకవిత్వసమితిన్ స్థాపించు సుబ్రాయనిన్.

క. అట్టి గురుమూర్తికడఁదా నిట్టలమగు శ్రద్ధతోడ నేరిచి యెంతేన్
బట్టుగఁ గూర్చుచుఁగవనము పట్టెన్ గంకణముగురుని ప్రజ్ఞన్ జాటన్.

మ. మహిళాలోకము నుద్ధరింతునని సన్మానంబులన్ బత్రికన్
మహనీయుండెవఁడిద్ధరిత్రిపయిసంభావించి యేటేట నీ
గృహలక్ష్మి బహుమానకంకణము నీఁగేరించె నా కేసరిన్
సుహృదోఘంబుల దీవనల్ సిరులఁదేల్చున్ నిత్యసౌఖ్యంబునన్.

—శ్రీ డాక్టరు పి. టి. జగన్నాధరావు.

# లక్ష్మీ శారదా నవరత్నహారము

చ. ప్రవిమలభక్తి యుక్తమయి భాసురభావమనోజ్ఞ పాకమై
కవిజనమోదసంభరిత గణ్యమునై మృదుశబ్దజాలమై
భువినలరించు వాగ్విభవభూషిత నీదు 'సరస్వతీ' కృతి
స్తవము సరస్వతీసతినిఁ దద్దయు నృత్యమొనర్పఁ జేయదే!

చ. గురుతర భావపూరితము గోవిద సంచయ విస్మయంబునై
సరసకవిత్వ తత్వరససాగరమై పరమార్థ బోధమై
సురుచిర దివ్యవైఖరుల శోభిలు నీదగు 'నాత్మబోధ' యి
ద్ధరణిని మెప్పుఁగాంచెఁ గవితావనితా వినుతాత్మభూషయై.

మ. కవితామాధురిఁ జిల్కుచున్ విబుధలోకవ్రాత సంస్తుత్యమై
నవనీతాంచితభావసంపదలతో నవ్యాగమప్రౌఢితో
భువనానందకరమ్మునై వరలుతన్ బుణ్యానుసంధాత్రియై
రవిచంద్రాదులువెల్గునందను కనీ 'రామాయణం' బీభువిన్.

## గృహలక్ష్మి జయంతి మహోత్సవము

గీ. సరసకవిసంచ యాలాప చతురిమంబు
పలుకు జవరాలి వాఙ్మయ కలకలంబు
విమల విద్వదలంకార విలసితంబు
వర్ష వర్షము నీవిచ్చు వైజయంతి.

సీ. సలుపుచుందువుగదా పలుకుఁ దొయ్యలిసేవ మహిళామణులభాగ్య మహిమఁదెలుపఁ
గూర్చుచుందువుగదా కోమలాకృతులెన్నొ కమనీయ కావ్యశృంగార మెసఁగఁ
బ్రకటించెదవుగదా పండితుల్ మెచ్చఁగాఁ బ్రతివర్షమునునీదు వైజయంతి
జరుపుచుందువుగదా సహధర్మచరణంబు కులసతీ ధర్మంబు వెలయుచుండ

గీ. సాహితీకన్యకఁ బెంచు సాధ్వివీవ
ధర్మమార్గంబునఁ బొల్చు తరుణివీవ
ధీవిశాల సరస్వతీ దేవివీవ
స్వర్ణకంకణమొందఁగా జాణవీవ.

చ. మృదుమధురంపుశబ్ద రసమిశ్రిత శైలిఁజెలంగి వాక్సతీ
హృదయసమాగతాచ్ఛతర హృద్యము భావసమన్వితంబునై
ముదమునవల్లకీరవము మ్రోగినభంగినిమ్రోగి బాపురే
సదమలరీతిఁ దెల్పఁగద చక్కని నీ కవితావిలాసముల్.

చ. చిరసౌభాగ్యచిరాయువుల్ గలిగి సుశ్రీలన్ విరాజిల్లు మా
యరయన్ శారదవైజయంతివన నుద్యల్లీల నెవ్వేళలన్
జిరకీర్తిన్ బ్రకటింపఁగల్గు గృహలక్ష్మీ కంకణంబందు ము
వ్వరఁ జేబ్రోలు సరస్వతీసతి! జయధ్వానంబులేపారఁగన్.

చ. సరససుబోధ తత్వమయి సజ్జన సన్నుతికిన్ నిధానమై
పరమపథంబునై మహిత భావసమన్వితమార్గదర్శమై
దొరలి ప్రమోదమై పలుకుఁ దొయ్యలిచేతికి భూషణంబునై
ధరనుతిఁగాంచు నీదు కవితావ్రతతీమణియెల్లకాలమున్.

ఉ. కోమలభావయుక్తపదగుంభన కోవిదశాణవౌట హృ
త్సీమ దృఢావబద్ధ సరసీరుహసంభవు రాణివౌట వా
గ్గామకృపానులబ్ధ కవిరంజకమంజులవాణివౌట శ్రీ
రామకటాక్షభాగ్యము తిరంబుగ నాయువునిచ్చి ప్రోచుతన్.

—శ్రీమతి గిడుగు లక్ష్మీకాంతం.

# నవరత్నమాలిక

శ్లో. శ్రీ మన్మహానంద రసాయయాసారామాయణీరమ్య కథావ్యథాయితీం
మానవీమానవ మాననీయాం సరస్వతీంపాతు సరస్వతీత్వాం.

ఉ. శ్రీ మహనీయవైభవవిశిష్ట కళాకవితావితానసా
రామృతరామతారక కథామలకోమల కోమలీకమై
కామితవస్తుసంఘటనకారణమై భవతారణైకతే
జోమయకావ్యరత్న పరిశుద్ధ సమృద్ధికి స్వర్ణకంకణ
శ్రీ మహితద్యుతుల్ దొరకె స్వీకృతహస్తవశీకృతంబులై.

సీ. భ్రమరహితాకార పద్మగర్భముబోలి భ్రమరహితాకార ఫణితిమెరయ
ముక్తాస్పదంబైన ముదితాస్తనముభాతి ముక్తాస్పదంబైనముద మెసంగ
చింతాకలాసంగ శ్రీ మహేశ్వరిరీతి చింతాకళాసంగ శ్రీ తలిర్ప
నవకోటి గుణశుభోన్నతధనుర్ద్యుతిభంగి నవకోటి గుణశుభోన్నతివహింప

గీ. రాముఁడాత్మ కథాసుధారసముఁగ్రోలి మెచ్చిపైడిచేకట్లు మీకిచ్చుటెంత?
కుశలవసుతాప్తిమున్ను చేకూర్చినట్లె కుశల వసుతాప్తి మీకుఁ జేకూర్చుఁగాత.

గీ. కోట నరకేసరీంద్రుఁడు నాటినట్టి యాంధ్రవిదుషీమణీ గౌరవార్థహేమ
కంకణమిదినీకరము నలంకరించె నౌర! మనగృహలక్ష్మి కటాక్షమమ్మ.

చ. వనితలు విద్యనేర్చికొని భారతసారతపఃఫలంబులై
కనుపడకింటిలో నివురుగప్పిన నిప్పులఁబోలిడాగి నా
రనుచుఁదదీయ కీర్తులు బయల్పడఁగా గృహలక్ష్మి కంకణం
బు నొసఁగనియ్యదే తెలుఁగుభూమికి "నోబెలుప్రైజు"తల్లిరో.

మ. చికిలింబెళ్కునిగారపుంమెరుగువాసిన్ రాసిగావోసి పై
డికి వేసారకబొమ్మఁ గట్టఁగలమోడిన్ జూపి మిన్నంటునం
తకుఁ ద్రోపాడుచు సంజఁబర్వలిడు జల్తారువ్వన్నె క్రొమ్మబ్బుటం
చుకుగుల్కుల్ గరపించుమీపలుకు లిచ్చోచ్చెనందెఁ బెండేరమున్.

చ. గుణములతాణమై సుకవికోటికి ముద్దులమూటలైయెరుచుల్
తొణికిసలాడుకైతలదులదూచితివమ్మరో! రామసుబ్బరా
న్మణిగురుఁడిచ్చు దీవనలమానితమై యపరంజిరత్న కం
కణమిఁకమీదటన్ గొలదికాలములోఁ దమకందుఁగావుతన్.

క. చరితార్థమై రసాలఫ
లరసాస్పదమగుచుఁ గల్పలతికాకృతితో
పరిమళమునద్దెసలనిడి
తిరముగవర్ధిలు సరస్వతీహారికృపచేన్.

# THY WORTH

## ACROSTIC—SARASWATI

**S**ay then! wherefore except in spring
**A**ll 'Kokils' tongue—tad cease to sing?
**R**ustling chorus the trees keep on
**A**nd drop their flutes in cold season.
**S**ee there! The trembling Starry team
**W**ill never maintain a steady stream
**A**lbeit! thy pen of glowing birth
**T**hwarts them—This Jewel's dazzling mirth
**I**n golden tongues proclaims thy worth.

—శ్రీ అచ్యుతుని వేంకటాచలపతిరావు.

సీ. రామాయణంబు నీ నామాంకితముఁ జేసి ఘనతఁ గాంచిన కావ్య కర్త్రివగుట
కవిరాజ కవిసింహ కవిసార్వభౌముల కింపుఁగూర్చిన కవయిత్రివగుట
సౌభాగ్యలక్ష్మి సుసంతానలక్ష్మి విజ్ఞానలక్ష్ములఁగల్గు చానవగుట
వినయసౌశీల్య వివేకసన్మార్గమే లక్షణలక్షిత లలనవగుట

గీ. నరయ గృహలక్ష్మి నీకు జోహారులిచ్చి
స్వాగతమొసంగె ఘనతరాహ్వాయమొసఁగ
హైమకంకణ మిడఁగనట్లగుట నీదు
ప్రతిభఁ జెప్పంగఁదరమె? సరస్వతమ్మ.

మ. కవితన్ గ్రాంధికపద్ధతిన్ నడుపఁగాఁ గష్టించి సుబ్రాయ స
త్కృవిదీక్షన్ వహియించి సంఘమును సంస్థాపించె నైజామునం
దు, వదాన్యంబగు కొల్లపూర్నగరమందున్ గీర్తి పెంపొందఁగాఁ
గవులన్ బ్రోచెడి రత్నమాంబిక కటాక్ష శ్రీలఁ బోషింపఁగన్.

గీ. అట్టి సంఘంబునందుపాధ్యక్షురాల
వీవు నాకను సభ్యత్వ మింతయుండె
స్వర్ణకంకణ బహుమాన భాగ్యమబ్బె
నీకటంచన మురిపెంబు నాకుఁగాదె?

సీ. సకలాంధ్ర సజ్జనుల్ సన్నుతింపఁగ నేఁడు సాటిబోటులమీరఁ జాలినావు
రసవత్తరంబుగ రాముగాథరచించి మేటికీర్తిఁ గాంచి మించితీవు
స్వకృతపద్యములెంత సారవంతములైన గర్వరేఖనొకింత గాంచవీవు
తియ్యని పల్కుల నెయ్యంబుఁ జిల్కుచు బుధజనాశీస్సులఁ బొందితీవు

గీ. దేశికుండగు సుబ్రాయ దీవనలను
విరివిగాఁ గాంచినందుకీవిధముగాఁగ
కీర్తి నార్జించి గురుకాంక్ష పూర్తిసేయ
జేకొనుమ కంకణము యశ శ్రీ జెలంగ.

—శ్రీ కందాళై సంపత్కుమారాచార్యులు.

క. కేసరి బహుమానము నీ కేసరియని చెప్పవచ్చుఁ బృధ్వీస్థలిలో
స్త్రీసంఘమిట్లు నీచే వాసిలఁగల నేర్పుకూర్పుఁ బడయుటకతనన్.

—శ్రీ యం. రామకృష్ణారావు.
*Personal Secretary, Jetprole.*

క. గృహలక్ష్మి సంపాదకు బహుమతిగా నీవు నొక్క బంగరు కడియం
బహహా పడయుదటంచని బహుదినములకీసువార్త పడె శ్రవణములన్.

క. బిడ్డ! సరస్వతి! యిది చెవిపడ్డది మన్మనముపోయి ప్రమదాంబుధిలో
పడ్డది; యెన్నాళ్లులకును నొడ్డెక్కదు నేనిఁకేమి యొనరుపవలయున్.

మ. మదియోజించియె వ్రాయనేనెదియొ యిమ్మాడ్కిన్ విచారించి వ్రా
యుదమేదో భవదంఘ్రిఁ గేసరి స్వకీయోద్యోగ ముద్యోగమై
పొదలం గంకణభూషఁగొద్దు సమయంబున్ గూర్చియన్నన్ గుణా
స్పద! యీ రీతిఘటిల్లెనేమి యిఁక నే వ్రాయన్ దలంపూనుదున్?

క. రామాయణ రమణీయత భూమిన్ బ్రాకటయు రసిక పురుషవ్రజముల్
నీ మృదు కవితామాధురి వేమారుం జుట్టికొన్క పెట్టఁగడంగెన్.

ఉ. కావున నొక్క కేసరియె కాదొక పైడికడెంబె కాదు నీ
కీవిధమెల్లరున్ సరసులిత్తురు సొత్తుల నో సరస్వతీ
దేవి! సరస్వతింబలె నుతింతురు నీ కవితారసంబె యీ
భూవలయంబునందగును బోయిఁక స్తవ్యము పూరుషాళికిన్.

క. గృహలక్ష్మి సంపాదకుఁ డహరీశుఁడు యమునఁబోలె నా గృహలక్ష్మి
సహితముగా విహితముగా నహరహమున్ బ్రోవఁగలఁడి కాత్మజ! మనుమా!

తే. సతిని లక్ష్మినట్ల సుతనిన్ సరస్వతి రామసుబ్బరాయఁ డోము గురుఁడు
ఇరువురకును మీకు నిక్కట్టులే లేవు పో, యిఁకన్ సరస్వతీ! యిటంటి.

క. నీ పోష్యవర్గమందలిదై పరఁగెడిఁ గాన నింక నా గృహలక్ష్మిన్
రేపులు మాపులు గనుచును నీ పితృపాదుండు ముదము నింపెడుగాతన్.

—శ్రీ జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు.
ఎడిటర్, అభినవసరస్వతి.

## గృహలక్ష్మి జయంతి మహోత్సవము

శా. శ్రీ మద్వాణి పరిగ్రహించె గృహలక్ష్మీ కంకణంబుం దయశ్
శ్రీమత్కేసరి ప్రాజ్యమాధనముచే శ్రీమత్రిలింగక్షమా
రామారత్నము మెల్లయల్లినటులే రామాయణంబల్లి యు
ద్దామఖ్యాతి సరస్వతమ్మ గొనె యాంధ్రబ్రాహ్మి వాగ్దేవియై

గీ. రామకథ వ్రాసియున్న కారణముచేత నాంధ్రకవితా సరస్వతి యనుబిరుదము
రమణులందుఁ జేబ్రోలు సరస్వతమ్మ పడయవలెనని సత్కవిపలుకరాదె !

గీ. ధారుణీంద్రుల సతులహృత్పద్మములను మధురకవితాభిమానపు మందిరముల
చేసి కవిపోషకత్వంబు స్త్రీలకు నిడు తెలుఁగుతల్లి సరస్వతీదేవియగుత.

—శ్రీ డా. ధూపాటి వేంకటసుబ్రహ్మణ్య సోమయాజులు.

# స్వర్ణకంకణ మహోత్సవాభినందన పంచరత్నములు

ఉ. శ్రీవిభుఁ జెప్పు నుత్తమచరిత్రల నెంతయు నగ్రగణ్యమై
పావనమైన రామకథ బండితవర్యులు మెచ్చునట్లు భా
షావనితా ప్రసాదమున శాశ్వతకీర్తి కలాపముల్ ప్రమో
దావహమై దిశాంతములనందగ ధన్యత గాంచితక్కరో.

సీ. అతులితభక్తి నచ్యుతు పదాబ్జమ్ముల నాత్మ నేమఱకుండునట్టి ఘనుఁడు
ఉరుగుణోన్నతకీర్తి నిరవద్యశేముషీ నిధిమనజనకుఁ డెవ్విధి నితాంత
ప్రియమారఁగా ముద్దు పేర సరస్వతి యని బిల్వ జాలెనాఁడది యమోఘ
మగురీతిదగ నేర్పుమయి సార్థకాభిధానముఁదాల్చి మేల్గాంచినావు బుధులు

గీ. మేలుమేలని వినుతింప మెఱసిమించి
ఆంధ్రభాషామతల్లి నత్యాదరమున
సేవజేసెడి భాగ్య సంసిద్ధియొదవ
గంటి వెంతయు భవతారకమ్ము గంటి.

ఉ. ధారుణి సత్కవీంద్రజనతా హృదయాంబుజ నవ్యసీమఁదా
గోరి యలంకరించిన సుకోవిదవందిత నాంధ్రదేవతన్
ఆరయ భావబంధురసమంచిత సూక్తి సుధాసుమంబులన్
వారక గొల్చికొంటివనవద్యయశః ఫలమార్య సమ్మతిన్.

క. ఆతతసారస్వత విఖ్యాతపు సేవన్ బుధాళిక ప్రతిమంబౌ
కౌతుకముగూర్చి కాంచన కౌతుకమందితివి కవులు గణుతింపంగన్.

శా. ఆనందంబు ఘటిల్లె నెల్లరకు నేత్రామోద మొప్పారఁగా
నీనాఁడిట్టి మహోత్సవంబు దమితో నీక్షింప నీకున్ కృపన్
శ్రీనాథుండసమానవైభవ శుభశ్రేణుల్ సదారోగ్య స
న్మానౌన్నత్యములన్ చిరాయువు నితాంతమ్ముం బ్రసాదించుతన్.

—శ్రీ విద్వాన్ ఆకుల గౌరీదేవి.

# ఆశీస్సు

సీ. ఆంధ్రలోకమున కత్యానందమెసగంగ రాణించి పత్రికా - రాజ్ఞివగుచు
గృహలక్ష్మికిని సాటి - గృహలక్ష్మియే యని గృహిణులెల్లరు గేహ - గేహములను
వేనోళ్ల వినుతింప - వింతవింతల బలు విషయచయమ్ముల - విందొనర్చి
కనక కంకణములు - కనకంపుపతకముల్ బలుయోగ్యతాపత్ర - ములు బిరుదులు

గీ. బుధులకర్పించి బహుమాన పూర్వకముగ సదమలమ్మగు కీర్తి సం - పదలు మెఱయ
వినుతికెక్కిన నీదు పే - ర్మిని వచింప దరమె జగదేకవిశ్రుత ! ధన్యచరిత !

ఉ. ఇంపుదలిర్పఁ దేనియల నీసడఁగింపగఁ జాలుమాటలన్
సొంపగు నీతులున్ కళలశోభిలు చిత్రతతుల్ ధురీణతా
సంపదనింపఁగాఁ దగిరసజ్ఞులు మెచ్చెడి సత్కవిత్వపుం
బెంపనవద్యవైద్యవిధి బెద్దలు పిన్నలు మెచ్చునట్లుగా.

క. లలితకళా విజ్ఞానము సులలిత సాహిత్యగరిమ శోభిల్లెడి మం
జుల సంగీతవిధానము బలువింతల విషయచయముఁ బాకపుకళయున్.

గీ. దేశదేశపువార్తలు దెలియజేసి కటికిచీఁకటిలో దీపకళికవోలె
భవమునడఁగించు సద్గురు వరునిమాడ్కి వెలుఁగుచున్నావు వెలఁదుల వెడఁగుమాన్పి.

ఉ. మానితకీర్తి 'కేసరి' కుమారికవై మఱి భాగ్యరాశివై
మానవతీమణుల్ మది నమందవికాసమునంద వారికిన్
మానక నీ హితంబధిక మాత్రమగణ్యము నద్వితీయమున్
మానిని ! మాధవుండఖిల మంగళముల్మహి నీకొసంగుతన్

గీ. పూతచారిత్ర ! నీకీర్తి భువిసమస్త దిక్కులకుఁ బ్రాఁకె నోడక నింక దివికిఁ
దివిరియెగఁబ్రాఁక నున్నది తీవ్రగతినిఁ దేజరిల్ల సరస్వతీదేవి పత్రి
కాధికారత్వమును దాల్చు కారణమున బళిరె ! నీ భాగ్యమేమని పలుకవచ్చు
నమ్మ గృహలక్ష్మి ! యిమ్మెయి నెమ్మితోడ వరుస మా దీవెనలనంది - వఱలుమమ్మ
ధరను మేల్గాంచి యాచంద్ర - తారకముగ.

—శ్రీ విద్వాన్ ఆకుల గౌరీదేవి.

# సువర్ణ కంకణ దానాభినందనము

## గీతమాలిక

రాల్చెఁగంకణమాంధ్ర సరస్వతియని; కంకణ ఝుణత్కృతులవ్రాసెఁ గబ్బములు స
రస్వతమ; యాఁగెనాంధ్ర సరస్వతికనుఁ దోయిఁగంకణమున్ జ్యోత్స్నగాముసాఁగె
మఱి సరస్వతి చేఁబ్రోలివరుస మెఱయ కేసరి ప్రదత్తము దిగంతకీర్తిదాయి
ధర్మకంకణం బొగివన్నె వాసిఁగాంచె "కేసరీ ! కీర్తి యిద్దినీకేసరీ" యని
ఆంధ్ర మహిళాంధ్ర భారతీ వ్యాకులత్వ మత్తగజ కేసరీ ! యని మహితులెన్న

—శ్రీ దోమా వేంకటస్వామిగుప్త.